SREE

# KOKILAMBA.

A Drama
IN FIVE ACTS



By
C JAGANNADHARAO
SECUNDERABAD



Printed at
Andhra Grandhalaya Press Ltd
BEZWADA
1924

# SREE KOKILAMBA

A Drama in Five Acts.

By

C. JAGANNADHA R

SECUNDERABAD



1ST EDN 1000 COPIES

Printed at

The Andhra Grandhalaya Press, Ltd.,

By Mr. K. Kodanda Ramiah,

BEZWADA.

1924



[Price Rs. 0—12—0

# విజ్ఞప్తి

సుజనవరులారా!

ఇందు ప్రతాపసేనుడు కడు దుర్మార్గప్రవర్తకుండగుటంజేసి తనతండ్రి యెల్లరాజ్యము తన జామాతయగు వీరసేనున కొప్పగించి యెప్పుడు ప్రతాపసేనుడు తన దుష్ప్రవర్తనమును వర్జించునో యప్పుడు తనరాజ్య మతనికీయుమని యానతిచ్చెను. బాల్యము గడచెను, యౌవనము దాటెను. కాని ప్రతాపసేనుడు తొల్లింటికంటె నెక్కువ దుర్మార్గుడై వీరసేనుని రాజ్యమున కరిష్టము కలుగజేయు నెడ వీరసేనుడతని చెరసాలయందునుప నాజ్ఞాపించెను. ఇవియెల్లను జూడకుండ ప్రతాపసేనుని భార్య కమలాంబ సుందరసేనుని జననానంతరమున దివికేగెను. అయ్యెడ సుందరసేనుడు మంత్రిగృహంబునందే యుంచబడి సకల విద్యాపారంగతుండై దినదినప్రవర్ధమానుం డయ్యెను. మిగిలిన కథ యెల్లను చదువరు లీనాటకమందే చదువగలరు.

మరియు నిందు నే గావించిన తప్పులు వేనవేలు గలవు. అవి పాఠకమహాశయులు క్షమియింతురుగాక. రెండవ ముద్రణమున చాల వరకు తప్పులు సవరించబడునని విన్నవించుచున్నవాడ.

ఇట్లు,

సుజన విధేయుడు,

సి. జగన్నాథరావు.

# Dedicated to the Great Bhavani of Calcutta.

## కృతి సమర్పణము

---

తే॥ గీ॥ వరహిమాగిరి ముద్దులపట్టి! ♦ వందనంబు
నేఁచించిన గ్రంథము ♦ నీవు కృతిని
గైకొనుచు నాంధ్రదేశము ♦ గాచి నీవి
క౯ సుకవితామతల్లిని ♦ గావుమమ్మ॥

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు.

వీరసేనుడు—రాజు

సుబుద్ధి—మంత్రి

జయధ్వజుడు—సేనాధిపతి

ప్రతాపసేనుడు—వీరసేనుని బావమఱది (సుందరసేనుని తండ్రి)

సుందరసేనుడు-ప్రతాపసేనునికుమారుడు, వీరసేనుని తదనంతరమున రాజు.

రామన్న, వెంకన్న, గంగాధరుడు సుబ్రహ్మణ్యము, బ్రాహ్మణులు

మహమ్మదు, రహిమాన్, రక్షక భటులు.

సేవకులు

## స్త్రీలు.

కోకిలాంబ—సుబుద్ధిమంత్రిపుత్రిక

కళావతి—వీరసేనుని పుత్రిక

కమలావతి—కళావతి చెలికత్తె

మంజభాషిణి, పుష్పమాలిక—కోకిలాంబ చెలికత్తెలు

కమలాంబ—సుందరసేనుని తల్లి, ప్రతాపసేనుని భార్య

కాళీ ప్రత్యక్షము.



ఓం శ్రీభవానీశంకరాయనమః.

శ్రీ

# కోకిలాంబ

## ప్రథమాంకము

(వీరసేనుడు, సుబుద్ధి, జయధ్వజుడు ప్రవేశం.)

వీరసేనుడు—సుబుద్ధీ! మంత్రిపుంగవా! యిప్పుడు మనరాజ్యంబున గల సమస్తజనులును న్యాయానువర్తనులై నిత్యసత్యవ్రతులై సురక్షితంబుగ వర్తిల్లుచున్నవారలా?

ఉ॥ మంత్రివరా! సుధీవర! స ♦ మంచితరీతిని సత్యవర్తులై
తంత్రవిదూరులై జను లు ♦ దాత్తమనంబున యున్నవారలో,
స్వాంతమునన్ సదావరము ♦ సద్వరముంబలె నాయనుజ్ఞ స్వా
తంత్ర్యమునన్ శిరంబునను ♦ దాల్చుచునుందురొ లేరొ చెప్పుమా॥

మఱియు, మంత్రిసత్తమా! యీవీరసేనుని పరాక్రమం బెల్లరకు విశదమేకదా! ఇప్పుడు యెవరైనను నాయాజ్ఞను శిరసావహించక మన రాజ్యచట్టంబుల నతిక్రమించుచు పాత్యకారులై పూర్వమువలె రాజ్యమునకు క్షోభ కలిగించుచున్నచో వేగంబ నిస్సంశయంబుగ జెప్పుము వారలను తక్షణంబ నానిశితకరవాలంబున కాహుతిగా జేసెద.

సుబు—రాజకిశోరమ! తమ ప్రతాపానలంబునకు యీ బాలగోపాలము సహితము కలయందైనను వెరచువారు.

ఉ॥ రాజశిఖామణీ! సకల ♦ రాజులు నిన్ననిశంబు మ్రొక్కుచున్
సజ్జనులై మనంబున న ♦ చంచలవృత్తిని నీయనుజ్ఞయే
రాజనమేర్పడంగను వి ♦ రాజితలీలను రాజబాటవా
లెన్నగలేక దలంచుచు మె ♦ లంగుచునుండెదువారు భక్తితోన్.

మరియు రాజా!

సీ॥ సతతంబు నీచెంత ♦ సకల పరిగణంబు
భవదీయయాజ్ఞకై ♦ వేచియుండ
జనమెల్ల మీరన్న ♦ జనకుడు మాకని
పరమభక్తిని సదా ♦ పూజసేయ
పట్టాబులన్నియు ♦ సజ్జనరక్షణ
దుర్జనశిక్షకై ♦ తూగుచుండ
ధరలెల్ల నేదేశ ♦ లెగుణించిమై వసు
ధను సౌఖ్యకరములై ♦ నయనుండ

తే॥ పంచబంగాళముగ నీదు ♦ వైరుల నెపు
డైన పాదోలగంబులె ♦ డి వరసేన
నాయకుండును బాహుల ♦ నానియుండ
గోడు లేకటిశంబు జ ♦ గంబునందు॥

వీర—మంచిది. మంత్రివర్యా! నీ విపు డనుదినంబును పూర్వపుభంగి గూఢచారులవలన నాదు రాజ్యపరిపాలనా విషయంబున ప్రజల యభిప్రాయంబు లరయుచుందువా?

సుబు—రాజా! మీరాయిచ్చినొప్పున గూఢచారులవలన తెలిసికొనుట యేకాక నేనుగూడ నొకానొకప్పుడు ప్రచ్ఛన్నవేష బునబోయి ప్రతిమనుజుని యభిప్రాయ మెట్లున్నదో తెలిసికొనుచుందును. రాజ్యపరిపాలనావిషయంబున యేలినవారి కణుమాత్రమైనను సంశయంబుపలదు. ప్రజలెల్లరు నేకవాక్యంబుగ తము పరిపాలనంబున వారనుభవించు సౌకర్యంబులు మరియేరాజు పరిపాలనంబునను జరుగలేదని వర్ణించుచున్నారు. మరియు

రాజా! కాలవశమున తుపానుచే పట్టి యల్లల నాడియూడి తుదకు తుపానానంతరంబున విశ్రాంతి పొందినటు లా ప్రతాపసేనుని దుష్కార్యములకు లోనయి యుండుకి యీ రాజ్యలక్ష్మి వెతలపాలై యుండెను. ఇప్పుడు తమరు ప్రతాపసేనుని చెరసాలయందుంచిననాటనుండియు ప్రజలందరును నిర్భయంబుగ దివారాత్రి సలుపుచున్నారు.

వీర—మంత్రీంద్రా! ఎంతకాలము వాని దుష్కార్యంబులకు సైచి యుండనోపెద. ప్రతాపసేనుడు మన బంధువగుగాక, తోబుట్టువు యొక్క పతియే యగుగాక, బావయే యనుకొమ్ము. ఎవ్వడైననేమి? రాజు సతతంబు ప్రజలకొరకెటువంటి కష్టతరమైన కార్యంబులనైనను జేసితీరవలెను. ప్రజలను రంజింపజేయుటకై కదా మున్ను శ్రీరామచంద్రుండు తనదు సతిని, పతివ్రతాశిరోమణిని, యాల సీతాదేవిని జనకుని ముద్దుపట్టిని నిర్దోషియైయున్నను కంపెను.

సుబు—సత్యము! సత్యము! తెలిసినవారు కనుకనే యాలోచించినారు.

వీర—చెరసాలలోనున్న మన ప్రతాపసింహునకిప్పుడనారోగ్యంబుగా నున్నటుల నిన్నటిదినంబుననే నే వినియుంటిని. ఎట్లున్నదో నీకు తెలియునా?

సుబు—ఏమి! అనారోగ్యంబుగ నున్నవాడా! యేమిటది? ఈసంగతి నేను మీరు నుడువ వినుచున్నాను గాని యింతకు పూర్వము నాకు తెలియదు. ఈదినమట కేగి సర్వము విచారించవలెను.

వీర—(సేనాధిపతివంకకు దిరిగి) మంచిది. జయధ్వజా! పురుషసింహా! నీదు సైన్యగణంబులన్నియు నీయాజ్ఞకు బద్ధులై యున్నవా? నీ ప్రతాపమంతయు నేనెరుంగునదియే గాని నీనోట వినుటకు మనంబున కుతూహలము వొడముచున్నది.

జయ—రాజేంద్రా! యేలినవారల కింద క్రొత్తవిషయము లెవ్వియును లేవు. నాపరాక్రమంబు నేను తమతో విన్నవించినచో నాత్మస్తుతి చేసుకొనువాడ నగుదును. అది పురుషలక్షణము గాదు. కాన క్షమియింప ప్రార్థించువాడ. అయినను తమ శత్రువు లెవ్వరైన కలరేని వెంటనే యానతిండు. వారల తక్షణంబ హటాహుటిని పటాపంచలు గావించెదను. మరియు నాదు సైన్యంబులెల్లను 'నెన్నడు యుద్ధము చేకూరును? ఎన్నడు మాబాహువుల తీట నణగించుకొని రాజాధిరాజునకు మావీర సేనునకు కీర్తి సంపాదించెద'మని వేచియున్నవారలు.

ఉ॥ ఇత్తరి రాజ బాహుబల ♦ మెన్నటికిన్ సరి యంచు సైన్యముల్
తత్తర మందుచున్ వరగ ♦ ధాత్రిని యుద్ధమువచ్చు వేళలన్
మత్తున గర్వమున్ గనెడి ♦ వైరులజంపుదుమంచు నిత్యమున్
చిత్తమునం దలంచుచు న ♦ శేషయశంబును గోరెదెప్పుడా

వీర—మీరిరువురును నాదు బాహుద్వయమై యుండునంతవరకు నాకేకొరంతయు వాటిల్లదు.

(సేవకుడు ప్రవేశించును.)

సుబు—రాజా! యిదిగో సేవకుడెద్దియో సమాచారంబు దెచ్చినట్లున్నది. వాడేలనో కాని భీతిల్లి యేమియో గద్గదస్వరముతో చెప్ప నుంకించుచున్నాడు.

రాజు—సేవకా! నీవేల నాదుసమ్ముఖమునకు సందేశము గొనివచ్చి చెప్పజంకువాడవు?

సేవ—ప్రభో! మరేమి లేదుగాని ప్రతాపసేనులవారు జ్వరముతో నున్నారని కారాగృహాధికారి మీతో చెప్పమంటె వచ్చెను.

వీర—ఆసంగతి నిన్ననే తెలియపంచితివిగా. మరల యేల వచ్చితివి?

సేవ—అందుకే బాబూ!

సుబుద్ధి—ఏమిరా భ్రష్టా! యిట్లు ప్రేలెదవు? మతి లేదా యేమి? నిన్నను తెలియజేసిన సంగతినే మరల తెలియజేయుటకై వచ్చితివా?

సేవ—అదికాదు ప్రభో! ప్రతాపసేనలవారికి రాత్రి జ్వరము యెక్కువైనదట.

రాజు—నేను నిన్నటి దినమునందే మన వైద్యరాజభిషక్చక్రవర్తిని చికిత్స జేయుటకై నచటకు పంపితినే. ప్రతాపసేను డౌషధము సేవించలేదా యేమి?

సేవ—ఔషధములు సేవించగా సన్నియు నిపుడు చల్లారినవి బాబూ!

రాజు—మంత్రిపుంగవా! వీడు చెప్పునదేమియు నాతలకెక్కకున్నది.

సుబు—ఓరీ! వ్యర్థా! జరిగిన సమాచారంబెల్లయు సవిస్తరంబుగ జెప్పుము. చెప్పకున్న తగిన ప్రాయశ్చిత్తంబును బడయగలవు.

వ.—ఏమిలేదు బాబూ! రాత్రికి ప్రతాపసేను వారు చనిపోయినారు.

రాజు—హాహా! యేమి! ప్రతాపసేనుడు కారాగృహమున మరణించెనా?

మంత్రి—ఈసంగతి నిటనే చెప్పరాదురా మూర్ఖా! ఛీ! బైటకు బొమ్ము.

[illegible]—ఎంతఘోరము వాటిల్లెను! హా! ప్రతాపసేన! యెంతమంది బుధజనంబులు బోధించి చెప్పినను వినక రాజద్రోహులకు హత్యకారులకు సేనానాయకుండవై కొలదిదినములలోనే మా రాజ్యలక్ష్మికి చెప్పనలవికాని వెతలు కుడిపితివే! ఈవిధంబున రాజ్యమున మితిలేని యనాచారము ప్రబలుచుండ యెన్నాళ్ళు నేను రాజునై సైపగలను? తుదకు నిన్ను కారాగృహమున వేయగా నేడు మమ్ములను బాసి దివికేగితివా! ఏమిచేయువాడను? నీ కారాగృహమరణకతంబున నేనీ భూజనంబుల నిందనకు పాల్పడితి గదా. హా దైవమా! మోతవ్రాసితివి! (నిట్టూర్పులీసి) ఈమర

ణము రానుండుటచేతనేకాబోలు నీచర్య లింత యల్పకాలములో నింత విపరీతములై పరిణమించెను.

మంత్రి—రాజా! విధిని తప్పించుట కెవరి శక్యము? మీరు వగవబనిలేదు. వానికి కారాగృహమరణము బ్రహ్మ నొసటవ్రాసియుండె నది యెవరు తప్పించ శక్యులు?

వీర—మంత్రీ! సత్యము, సత్యము. వాని కారాగృహమరణముతోడి నాకు భూజననిందకూడ వ్రాసెను.

జయ—రాజేంద్రా! సకలసద్గుణసాంద్రా! సకలంబు నెరుంగువారలు మీరే యీవిధంబున ప్రసంగింప మేమేమి జెప్పువారము? మీరు ప్రజానురంజనార్థమై కదా, రాజధర్మమైనను తలపక ప్రతాపసేనని కారాగృహ బద్ధునిగ జేసితిరి. అట్టివారలకు తమను ప్రతాపసేనుని మరణంబునకు సమస్తప్రజలంబులు సంతసింతురు! ఇది యేటిమాట రాజా?

రాజు—తండ్రి మరణంబునకై సుందరసేను డెంత విలపించునో గదా?

సుబు—(తనలో) సుందరసేనుకు తనకు తండ్రి మరణంబునకై దుఃఖించుటయేగాక రాజుయందు తప్పక వైరమూనును. వైరమూని నను సుందరసేను డిపుడేమియు జేయజాలకపోయినప్పటికి కొలదికాలంబులోనైనను తిరుగ ప్రతాపసేనుండనతె రాజద్రోహులకు మొనగాడై పగతీర్చుకొనును. (ప్రత్యక్షము) రాజా! సుందరసేనునకు వాని తండ్రి మరణించెననువార్త నెరింగించుటుచితముగాదని నే జెప్పువాడ. ప్రతాపసేను డింతకుముం దెన్నో సారులు తీర్థయాత్రలు జేసివచ్చెదనని పలుమారు బలుకుచుండెడివాడుగాన తనతండ్రి యాత్రార్థమై వెడలెనని యెఱింగించు టుచితము.

వీర—మీయిష్టమువచ్చినభంగి నొనర్పుడు.

సుబు—గతించినదానికి వగచిన ప్రయోజనంబేమి? త్వరితముగ నేగి యుత్తరక్రియా సన్నాహము లాచరించవలెను రండు.

(నిష్క్రమింతురు)

---

ద్వితీయరంగము.

కోకిలాంబ ప్రవేశము.

కోకి—నే నేమి కతంబునో గాని నాదు చెలువుడింకను రాలేదు. కారణంబేదియో తెలియకున్నాను. అదిగో! నామోహనాకారుని చిత్రము మా ఱల్లయై యున్నది. (దాని యందగి చిత్రము పరికించి)

చ॥ అనుపమరూపవంతుడగు ♦ నాదు మనోహరుడుర్వి ప్రఖ్యాతిగనే
నునిగుతు నీపటంబు గని ♦ నంతనె ప్రాణసమానుడంచు, హా! న
న్ననవరతంబు నిర్దయతి ♦ నా ప్రియుఁ డేని కతంబునంగదా
కలుగడు! బాధపైబడవు ♦ కాంతుడు చెంగటనున్న రావుగా.

అదిగో, యొకరిదో కాలిచప్పుడు వినవచ్చుచున్నది. ఈదెస నెవరో వచ్చుచున్నారు.

(సుందరసేనుడు ప్రవేశించును.)

సుందర—చెలీ! నీవు నాకంటె నేను ముందుగనే యిచటకేతెంచి బడికి వెళ్ళుటకై సంసిద్ధురాలవగుచున్నట్లున్నదే!

కోకి—ఆర్యా! నేను నేడు తమకంటె ముందుగనే వచ్చితిని మీరేమి కారణంబుననో గాని యాలస్యముగా నేతెంచుటచేత నేనేమియో మదుగ వచ్చినట్లున్నది గాని నేను యీ ధ్రాంతి కారణంబుగనే వచ్చితిని.

సుందర—చెలీ! సత్యము వచించితివి. నేడించుక వచ్చుట కాలస్యమైనది. చెలీ! నీచేతిలోని పట మెవ్వరిది?

కోకిలాంబ—(సిగ్గు నభినయించును)

సుందర—ఏదీ! యిటుగొనిరమ్ము, చూత మెవరిదో. (అని పటంబును కోకిలాంబ హస్తంబులనుండి గైకొని చూచును) చెలీ! నీయొక్క చిత్రలేఖనానైపుణ్య మెంతని కొనియాడుదును! ఈ చిత్ర మెప్పుడు లిఖించితివి?

కోకి—నేను వ్రాయుచున్నప్పుడు మీతో చెప్పమరచితిని. వ్రాసి కొలదిదినములాయెను.

సుందర—కళావతిప్రియచెలివి కదా, నీకమాత్రపు కళ లుండకపోవునా! అహా యేమి! నీచిత్రించనాపటము! సఖీ! నే నిపుడు నీ రూపము వ్రాసెద జూడుము. నీవు నాప్రియసఖవై యుండ నేను వ్రాయుట యొకవింతా! (అని వ్రాయబూనును)

చ॥ చెలువము మీఱఁగా సఖియ ♦ చూడుము నీయసమానరూపమున్
చెలియ వినీలకుంతల ర ♦ చించితి నీకతి సంతసంబునన్
కలువలరేనిమోమును ♦ కంతుని జేతి సుమల్లెమొగ్గలై
లలిని మదీయ నేడవలె ♦ నన్నిటనుంచుము నామనోహరీ॥

కోకి—ప్రియా! హేళన చేయవద్దు.

సుందర—హేళన గాదు సఖీ! నిజము వచించితిని. నేనుగూడ వ్రాసితిని గాని నీవు వ్రాసినంత సొగసుగా నేను వ్రాయలేకపోతిని. చూడుము. సఖీ యిందెవరో వచ్చుచున్నట్లున్నది. చూడుము.

(సుబుద్ధి ప్రవేశించును)

సుబుద్ధి—సుందరసేనా! అమ్మా కోకిలాంబ! మీరిచట నేమిచేయుచున్నారు? బడికివెళ్ళుటకై సంసిద్ధులగుచున్నవారలా యేమి?

కోకి—అవును నాయనా! బడికి వెళ్లుటకై సంసిద్ధుల మగుచున్నాము.

సుబు—(తనలో) హా నాయనా! సుందరసేనా! నీ వెంతభాగ్యహీను

నవు, తండ్రీ! ఆ తల్లి కమలాదేవి నీవు చిరుతప్రాయము లోనే మరణించెను కదా! మరణించెబో! నీదుతండ్రి యేల దుర్మార్గులతో గూడి తుదకు కారాగృహవాసము జేయవలెను? అచలనైనను జీవించియుండక నిన్ను నొంటరిగా జేసి పోవలెనా! హా దైవమా! యెంతటి దారుణము! నే నీ బాలుని జూచినపుడెల్ల నపరిమితశోకవారాశియందు మునుగుచుందునే!

సుందర—ఆర్యా! నేడేలనో గాని తమ ముఖబింబము మిక్కిలి కళాహీనమై చూపరులకెల్ల నెద్దియో విచారంబుచే నట్లు చెందెనని తోపఁజేయుచున్నయది.

సుబుద్ధి—(తనలో) హా దైవమా! నే నీ దుఃఖము నెట్లడగించుకొని యెదను! (ప్రకాశముగా) సుందరసేనా! విచారమెద్దియును లేదు. శరీర మించుక యారోగ్యము తప్పి యుండవచ్చును.

సుందరసేనుడు—ఆర్యా! నేను సాయంసమయమున బడి ముగించిన తోడనే చెరసాలవద్దకేగి మానాన్నగారిని దర్శించి మనమువ్వరము మరలి వచ్చెదమా?

సుబుద్ధి—(తనలో) హా సుందరసేనా! ఇంకెక్కడి నాయన తండ్రి! నిన్నటి రాత్రితోడనే మీయిరువురి ఋణము తీఱినది. ఈ దినంబున నాకు నీ మామయగు వీరసేననియొద్ద నెక్కుడు మంత్రాలోచన బు కలదు. మరల నీతండ్రి యిప్పుడు యాత్రార్థమై వెడలినట్లు తెలియుచున్నది.

సుందర—యాత్రకు వెళ్ళినచో కోకిలాంబకు, నాకు చెప్పకుండగనే పోవునా?

సుబుద్ధి—సుందరసేనా! చెప్పుట కవకాశము లేకపోయియుండ వచ్చును.

కోకిలాంబ—నాన్నా! మా మామయ్యకు తీర్థయాత్రలు చేసికొని తిరిగి యిటకు వచ్చునపుడు మాకొరకై యేమేమి తెమ్మని చెప్పినారు?

సుబుద్ధి—అమ్మా! కోకిలాంబ! ఏయేతీర్థములయొద్దనైనను శ్రేష్ఠమైన వింతవింతలగు వస్తువులున్నచో మీా యిరువురకొరకవశ్యముగా తీసికొనిరమ్మని పలుమారు చెప్పియుంటిని.

సుందర—ఆర్యా! మాకిపుడు బడికి వేళయగుచున్నది. నేను కొన్ని పుస్తకములు తే మరచితిని. సెలవిండు. మరల వచ్చెదను.

సుబుద్ధి—మంచిది. సుందర సేనా! త్వరితముగ వెడలిరమ్ము.

(సుందర సేనుడు నిష్క్రమించును.)

అమ్మా! కోకిలాంబ! నీతో నేనింతకు పూర్వం బొకసారి చెప్పినసంగతి మఱచితివా?

కోకిలాంబ—అది యేమిసమాచారము నాన్నా?

సుబుద్ధి—నేటినుండియు నీవు బడి ముగించి యంతఃపురంబునందే యుండుము. నే నిపుడు కొండొక కార్యవిశేషంబున సేనాపురము బోవుచున్నాను. నేను మరల వచ్చుసరికి కొన్నిదినంబులు పట్టును. అప్పటికి నీవు బడి ముగియించి యంతఃపురంబున వాసంబు చేయుచుండవలయును.

కోకిలాంబ—నాన్నా! అలాగుననే మీరాయిచ్చవచ్చినటుల జేసెదను.

(సుబుద్ధి నిష్క్రమించును.)

(కొంతసేపు యోచించి) చిన్నతనంబునుండియు నేనును, నాడు చెలికాడు సుందరసేనుడును కడుమైత్రిమై మెలంగితిమికదా! మా దేహంబులు భిన్నములైనను ప్రాణములు మాత్రమొక్కటియే. నే నిక నంతఃపురవాస మొనర్చునెడ సుందరసేనని—నా దుసఖుని—జూచుట సున్న. అహా! నే నెన్నడు తలపని వియోగంబు నేడు మాకు కలుగబోవుచున్నదికదా! హా జగజ్జననీ! తల్లీ! పరమాదేవీ! నే నిక నీ వియోగసాగరంబు నెట్లీదుదాన!

ఈ సంగతి సుందరసేనుఁడే విన్నచో నెంత ఖేదంబు చెందునో కదా. కానిమ్ము. ధైర్య మవలంబించెద. బడికి వెళ్ళుట కిఁకను వేళయాయెను. కడసారి పాఠశాలకేగి గురుకట్నంబు సమర్పించి యెల్లరకు వందనంబు లాచరించి వచ్చి పితృవాక్యపరిపాలనంబు జేసెదగాక!

(అని నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

సుందరసేనుఁడు—నేను నాచెలికంటెను ముందుగ పాఠశాలనుండి వెడలి వచ్చుచుంటినిగాని కోకిలాంబజాడ యెచ్చట గానరాకున్నది. నాచెలి వచ్చువరకు నిచ్చట వేచియుండి వచ్చినవెనుక నిరువురము గలిసి గృహంబున కేగెదము. దినదినంబా మెకు నాయందుగల ప్రేమాతిశయం బధికమగుచున్నది. పూర్వము వలెగాక నే నిప్పు డొకగడియ నాచెలిచెంత లేకున్నయెడ నన్నియో యేండ్లుగడచినట్లు వగచుచుందును.

సీ॥ నిముసంబు చెంతను ♦ నేను లేకున్నను
కలకంఠి మదినెంతొ ♦ కలఁగఁజెందు
ఏదినంబునగాని ♦ యేఁబోవకుండిన
పరిచారికలచేత ♦ పంపు వార్త
వార్తవెంబడి నేను ♦ వడి నేగితినయేని
కడుదైన్యమున నీరు ♦ కంటవెట్టు
వెట్టుచు, 'న్యాయమె ♦ యొట్టుపెట్టిన భంగి
నిటకు రాఁరైతిరి ♦ నెటులసైతు
తే॥ గావుడీ నాథ! నా ప్రియా! ♦ కరుణనిపుడు
నన్ను క్షమియించుడి నేన ♦ నాథ,నంచు
పలుతెరంగుల గాళ్ళపై ♦ బడుచు తనదు
బాహుపాశంబునను నన్ను ♦ గట్టికట్టు.

అదిగో! నా కోకిలాంబ వచ్చుచున్నటు లున్నది. అదిగో! నా ప్రియ కాంత కోకిలవలె రొదసేయుచున్నది. ఇంత సేపటి నుండియు కోకిల స్వరంబు వినవచ్చుచుండెను గాని యీవసంత కాలంబు నను లేమావిచిగురుల మెక్కి-మెక్కి క్రొవ్వియున్న యీ కోకిలపక్షికూతయే యని యనుకొంటిని గాని నాదు కోకిలా సతి తనదునామంబు నిపుడు సార్థకపర చుకొనుచు నన్ను నిలువ జేయుటకుగా నిట్లు కోకిలకంఠి యైనదని నే ననుకొనలేదు.

ఉ॥ అద్దిర! నాలతాంగి యహ ♦ హా! మదవారణయాన యెంతయో
ముద్దులుగుల్కు పల్కులున ♦ ముంగురులుం రహి మించుచుం సదా
నిద్దపు చెక్కులుం గలిగి ♦ నీరజలోచని నన్ను గేరుచుం
దద్దయు మందహాసవద ♦ నంబునతా నిటు వచ్చుచుండె హా॥

నన్ను ప్రేమాతిశయంబు మీరగ పిల్చుచు కడునాత్రితతో వచ్చుచున్నదికదా. నేను కొంతసే పీ వీరపొదలచెంతను దాగి యుండి నాదు చెలిమనంబారసెదను.

కోకి—కోయి! కోయి! (అని ప్రవేశించి ఇటు నటుజూచి) యేమి యీవింత! నా ప్రియు డింతసేపు నీరసాలసాలంబు క్రిందనే నిలిచి నా నిమిత్తమై వేచియుండెనే! నేను వచ్చునంతలో నదృశ్యమాయెను. నేను వచ్చుట కాలస్యంబైన కోపించి నేను వచ్చు వరకు నిచ్చట నిలుచుట కిష్టపడక ముందుగనే గృహంబున కేగియుండవచ్చును. నాయంతటి పాపి యీముల్లోకములలో మరిలేదు. ఆహా! నే నెంతటి పాపకర్మంబులుచేసి జనించితినో కద! (కొంతసేపు విచారించి) నా ప్రియుడు నన్ను బాసి త్వరితముగ గృహమున కేగునా? కాదు, కాదు, కలయుండైనను కల్ల. నను కనిపెట్టుటకై యెందైన నీపొదలచాటున దాగి దాగియుండనోపు. (ఇటు నటు జూచి) సఖా! రండు! రండు! చూచితిని. అల్లదిగో! అచట విరిజాజిపొదలనడుమ దాగి యున్నవారలు. (నిరీక్షించి) ఇదిగో! నా కాంతుని మృదుపద

చిహ్నములు గానవచ్చుచున్నవి. వీని వెంబడి పోయి జూచెద గాక! (ముందుకు కొన్నియడుగులువేసి) ఇచ్చటవరకు నాకాంతునివైన యీపదచిహ్నంబులు స్ఫుటంబుగ గానవచ్చెను. కాని యికముం దెల్లయెడల నేల పచ్చికతో నిండియుండుటచేత నవి గానరాకున్నవి. నేను నాకాంతునిజాడకై యిచట నెవరిని వేడుకొనియెద! అకటా! అయ్యో! వృక్షంబులారా! మీకైన కరుణరాదా నాయందు!

తే॥ చెప్పరే మీరలైనను ♦ చెలువు డెందు
డాగియుండెనో మఱి యెందు ♦ టక్కరితన
మున మసలుచుండెనో నాదు ♦ మనమరయుట
కైన నవ్వులాటలకైన ♦ కలిసి మెలసి॥

ఈదెసను జూచెదగాక! (కొంచెము నడచి, యున్నకని నేల యందు కూలబడును)

సుందర— చెలీ! ఏమివాటిల్లె? ఏమి వాటిల్లెను?

కోకి— ఏమియు లేదు నాథా! నిశితకంటక మొకటి పాదంబున దిగ బడినది. ఇదిగో! తీసివైచుచున్నాను. (అని తీసి పారవైచును)

సుందర— అయ్యో! నేనెంతటి కఠినహృదయుడను! చెలీ! నాకతంబున గదా, నీ మృదుపాదపల్లవంబు నిశితకంటకంబునకు పాలాయెను? ఎంత బాధించెనోకదా?

కోకి— నాథా! ఈ స్థూలశరీరంబున కెంతటిపాట్లు కలిగినను బాధించదుగాని మీదు సూక్ష్మమనంబు నాకతంబున నతగా పశ్చాత్తాపము నొందవలసివచ్చెగాయని నాకెంతయో చింతగా నున్నది. మఱియు,

తే॥ ప్రియుడ! ముల్లు లేనేలేదు ♦ రయముతోడ
విరి పాదలనుండి మిమ్ముల ♦ వెడలజేయ

మరుడు రమణిపై నేసిన ♦ శరముగాని
యల్లచేవపై బెస్తని ♦ ముల్లుపగిది॥

నాథా! నిజముగా నిది కంటకంబుగాదు. ఈ జగతియం దెడి మోహాంబుధి నీదు మనుజమత్స్యములయందల మన్మథుడ నెడి బెస్తను తనదుములుకుల నేయుచుండును.

సుందర—ఆహా! చెలీ! ఎంత యింపుగా వచించితావు! ఏమి నీదు వాక్చాతుర్యము!

కోకి—నాథా! చూచితిరే! ఆగువ్వ లేంటుల జోడుజోడులుగనుండి విహరించుచున్నవో!

సుందర—అవును చెలీ! ఇది వసంతకాల మగుటచేత సకలజీవకోటి యు నత్యంతానందభరితములై దినములు గడుపును. ఈకాల మునందు కల్గెడియుత్సాహ మింకొకకాలమునందు చేకూరనేర దు. ఆ! ఆ! చూచితివా చెలీ! ఎటులు నొకడేగ వచ్చి యా జోడు పక్షులలోనుండు నొకదాని నెత్తుకొనిపోయి, మరల నెందుచేతనో తెలియదు, క్రింద పడవైచి పారిపోయెను.

కోకి—అయ్యో! పోనిండు. ఆదంపతిద్వయముపై నల జగజ్జనని కరుణ పూర్ణముగా నున్నది. లేకున్నచో మృత్యువునోటం జిక్కి మరల సురక్షితముగా వెలుపలబడుట దైవసహాయము గాకున్న నిం కేమి? నాథా! నాథా! ఆవంక జూడుడు! ఆమాధవీలతి కడు మమతనుచెలంగు సతీపతులవలె నెటుల నాఘనభూరుహంబును నల్లిబిల్లిగ పెనంగుచు తన బాహులతలచే బంధించినదో చూచి తిరా?

సుందర—సఖీ! చూడ కడురమ్యముగ నున్నదిగాని వారి కప్పుడప్పుడు ప్రళయకలహంబు గలుగుచుండు.

కోకి—అదియెట్లు నాథా! అదియేమి, నిజంబుగ మనుష్యదంపతులా యేమి!

సుందర—చెలీ! ఇటువినుము, చెప్పెద. గాలి యొకానొకప్పుడు గట్టిగా వీచినయెడల నల మాధవీలత తనదుప్రాణనాథుని చెంగటనుండి విడదీయబడుచుండును.

కోకి—అది ప్రణయకలహముగాదు నాథా! వారు మితిలేని ప్రేమమై మెలంగుటజూచి యీలోకమునగల కొందరు దుష్టులు వార లకు వియోగము కల్పించెదరు. ఆ మలయమారుతము వీరల యన్యోన్యానురాగసంపద జూడలేక వారల నట్లు విడదీయుచుం డును. కాన నది ప్రణయకలహ మెట్లగును? నాథా! మఱి యు జూడుడు. కొంతసేపుముందు—యిప్పుడే మనము చూచితిమి గా—కోడిగువ్వలు కలిసి విహరించుచుండ వానిని నల డేగ వచ్చి యెడబాపజూచెనుగాని ప్రపంచమున దుర్బలులకు దైవ బలంబు మెండుగాన తనమాట లచ్చట సాగినవికావు.

సుందర—చెలీ! నీవు వచించునది సత్యము. ఏమి నీబుద్ధికౌశలము!

కోకి—(నిలువబడి విచారించుచుండును.)

సుందర—చెలీ! ఏమి నీవట్లు విచారించుచుంటివి? ఏమి నీస్ఫురణకు వచ్చెను? ఏల నీముఖపద్మ మింతలో వాడెను? ఇరు డస్తమించు చుండ పద్మములన్నియు వియోగదుఃఖభరమున వానివాని ము ఖములు ముకుళించెనుగాని నీ ముఖపద్మ మేల యింతలో నిత చిన్నబోయినది?

కోకి—ఏమియు లేదు నాథా!

సుందర—నీవు కాంతివిహీనవైయుండ జూడ నామనంబు తల్లడిల్లుచు న్నది. నీకేమైన నాపద లటస్థించినయెడల జెప్పుము. సంశయిం చవలదు.

కోకి—నాథా! ఇంతసేపు మన మింత యానందంబున వసంతకాల ప్రకృ తివిశేషంబులను కన్నులపండువుగా జూచుచు వచ్చితిమిగాని యికను నే నడువజాలకున్నాను. నోట మాట లెడబడుచున్నది.

మనము చూచిన రెండువిషయంబులును మనలోన బరిణమిం
పఁబోవుచున్నవి.

సుందర—అదేమి! మనల నెడబాపఁజూచు దురాత్ముం డెవండు?

కోకి—తొందరపడకుడు. నేను జెప్పునదెల్లను సావకాశంబున విన
గోరెద. ఈదినంబున నాతండ్రి నన్ను బిలిచి యంతఃపుర
మున నుండుమని యాజ్ఞాపించెను. మఱియు నిప్పు డాతఁ డెద్ది
యో కార్యవిశేషంబున దేశాంతరంబు బోయి వచ్చెదనని
చెప్పెను. నా వివాహప్రయత్నంబులకై తాను దేశాంతర బు
బోవుచుండెనని తరువాత నాచెలులు చెప్పిరి.

సుంద—ఏమేమిరా! చెలీ! నీతండ్రి యింక నిన్ను బడికి పోవలదని
యాజ్ఞాపించెనా? నీవివాహప్రయత్నంబులు సేయుటకై దేశాం
తరము వెళ్లెనా? మంచిది. చెలీ! కాలం బెల్లవేళల నొక్కరీతి
నుండబోదు. ఇందులకై నీవు విచారించవలెనా? అవశ్యము
నీపితృవాక్యపాలనంబు సేయుము. నీవు లేకున్న నాకీబడి యెం
దులకు! ఈయుద్యానవనంబు లెందుకు! వేయేల! ఈజీవన
మెందుకు! నేనిక హిమగిరి ప్రాంతములకేగి తప మాచరించెద.

కోకి—హా ప్రియా! ఎంతటి కర్ణకఠోరంబులగు వాక్యములు వినవలసి
వచ్చెను! మీరు గడియ కనుపించనిచో, హా నాథా! నేనెట్లు
సజీవనై యుండనోపెద. మీవెంబడి నన్ను గొనిపొండు, లేదా
నాదుహృదయపీఠంబునందు మీపాదపంకజంబులనే నెలకొల్పి
పూజించుచు ప్రాణత్యాగము జేసెద.

సుందర—చెలీ! వలదు, వలదంతటిఘోరకృత్యం బాచరించి యిహపరం
బులకుకూడ దూరంబగు టుచితముగాదు. చింతించవలదు. ధైర్య
మూని సర్వభారము నాజగన్మాతపై వైచియుండుము. ఆమె
యే మనలను దరిజేర్పగలదు. నీతండ్రి నుడివినప్రకారంబు
నీ విక నంతఃపురంబుననే వసియుండుము. నేనెట్టులైన ప్రతి
దినంబు వచ్చుచుండెద. విచారించకుము.

కో—హా నాథా! నేనే యంతఃపురవాసంబు జేయు నెడ మీరు నావి
మిత్తమై వచ్చుట యెట్లు? అది కడు దుర్లభముగాదా?

సుందర—గా కేమియును చింతలేదు. నా చెలికాడగు విశ్వకర్మచే నీవుం
డు నంతఃపురంబున కొక సొరంగము నేలగుండా మన యుద్యాన
వనంబునుండి నిర్మింపజేసి దానిగుండా నేను నిర్భయంబున
వచ్చుచుండెద చెలీ!

కో—మంచిది. చీకటి క్రమ్ముచున్నది. రండు, వేగంబ గృహంబునకు
బోవుదము. (నిష్క్రమించును.)

---

చతుర్థరంగము.

రామన్న—ఏమిరోయి, వెంకన్నా! బహుకాల దర్శనం. నీ మొగ మేమి
రోయి! ఉన్ ఔజెంట్ క్యాండిల్ పవర్ గ్యాసులైటులాగున
వెలిగిపోవుచున్నాది!

వెంకన్న—ఏమీ లేదురా! ఏదో యొకమూల నీలాగు పడియున్నాము.
మమ్ము నీలాగు బ్రతుకనియ్యి.

రామ—బ్రతుకనియ్యకపోతే నేను మీ కేమికీడు చేస్తూయున్నాను?
కాని, యీమధ్యనంతా యెక్కడికి ట్రిప్పులుకొట్టి వచ్చినావు?
రవుండ్ ది వర్ల్డ్ ఇన్ ఎయిటిడేస్ లాగున్నది.

వెం—ఎక్కడికి లేదురా! ఈలాగు రామేశ్వరం, తిరుపతి, కంచి
కాళహస్తి యివన్ని యొకచుట్టు చుట్టి వచ్చినాము రా.

రామ—ఇదంతా F. S. యేనా? కాకపోతే నీ ముగం నీవు టికెట్టు
కొంటావు!

వెం—నీ వేలాగనుకుంటే అలాగనుకోగాని, యేమిటి యీమధ్య
నొక కొత్తసంగతి జరిగిందట. ప్రైవేట్ కాన్ఫిడెన్షల్ గా వ్యాపార
మంతా జరిగిందట. ఏమిటి నవ్వాడికూడ యీలా గూరుకో

పడము నాకేమి బాగులేదు. మనబ్రతుకుల్లో నీళ్ళే. ఆసుందర సేనుడేమో యెవ్వడు తన ప్యాలస్‌నంచి క్రిందికైనా దిగడు. దిగినా మనతో నెవ్వడైనా వంటరిగా కలియుట తటస్థించుటే లేదు. ఎమ్డెలాటి వాడివి నువ్వుండికూడా యీలా కూరు కోవడము బాగులేదు.

రామ—ఏం చెయ్యనురా! యెప్పుడు చూచినా సుందరసేనుని కా మంత్రి బాడీగార్డ్. లేకపోతే జనానాకార్ట్‌లో కూర్చొని వెళ్ళి నప్పుడు మనము యేలాగు మాట్లాడతాము? ఎటిక్వెటైనా అబ్జర్వు చెయ్యవద్దురా?

వెం—నీ వెప్పుడును యెటిక్వెట్, యెటిక్వెట్ యంటూనే మాయం దరి గొంతుకలూ కటుక్కున గొరికినావు.

రామ—మీ కందరికి నే నేమినష్టము కలిగించినాను? నలుగురిబ్రగ దివాళకొట్టినామా, యిందాము పంచకొని శుభ్రముగా యిన్ని మెతుకులు తింటాము, లేదా పస్తుపడుకుంటూ యున్నాము. మీదుమిక్కిలి నేను లీడర్‌గా వుండడమువల్ల యెక్కడదెబ్బలు నావే. కనిపించకుండా దోచుకున్నదంతా నాకైనా యొకప్పుడు చూపించకుండా పట్టుకొని పరుగిడతారు మీరు. చూసేవుగావు, నాలుగు నెలల క్రిందట నా వర్షమునాటి హర్షము. ఆమేఘము వేసి చిట్టచీకటి క్రమ్ముకొనగా దాదాపు నలుబదిమంది గుర్రపురౌతులతో నొక్కడినే పోరాడి బైట పడితిని. ఆదినమ్రా, యొకొక్కక్కడిని పనసకాయ చెక్కినట్టు చెక్కినాను!

వెంక—నీవనగా యేమిట్రా! పనసకాయ చెక్కినట్టైనా చెక్కుతావు. కైమాకొట్టినట్టైనా కొడతావు అందుకేగదా నిన్ను మా లీడర్‌గా నుంచినాము. ఏదీ మైడియర్ హెర్క్యులీస్! వక్క షేక్ హాండు! (షేక్ హాండిచ్చును.)

రామ—అవునుగాని మన మిప్పు డాలోచించవలసినపని బోలెడుంది. ఇన్నాళ్ళు యువర్ మెజస్టీ లేకపోవడమువల్ల మన క్యాబినెట్టంతా సస్పెన్షనులో వున్నది. ఈ వాళ్ళరాత్రి మన రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకు స్క్వ్యార్ గా అటెండు కా! నీకింకా మేమందరము చెప్పవలసినసంగతు లెన్నో వున్నాయి.

వెంక—ఆల్ రైట్! అయితే యువర్ విల్ అండ్ ప్లెజర్. గుడ్ మార్నింగ్! (నిష్క్రమించుదురు.)

ప్రథమాంకము

సంపూర్ణము

---



ఓం శ్రీభవానీసహాయం.

శ్రీ

# కోకిలాంబ

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

(కోకిలాంబ ప్రవేశము)

కోకి—నాజనకుడు గృహంబునుండి వెడలిననాటనుండియు నా చారు మోహనాకారు డొకసారియైనను నిటకు రాలేదు. ఆదినంబున నన్ను బడినుండి వచ్చునప్పుడు సర్వము తెలిసికొనినపిమ్మట నన్ను బుజ్జగించెనుగాని, తన మనంబు పరిపరివిధంబుల చంచలత బెరయకుండునా? (కొంతసేపు యోచించి) ఆహా! సూనాస్త్రుడు తన వాడియౌ స్త్రంబులను పదునుపెట్టుచున్నవాడుకదా!

మంజు—(ప్రవేశించి)—చెలీ! కోకిలాంబ! నీవిట నొంటరిగ నేమిచేయుచున్నావు? నీవేల యిటుల ఖిన్నవదనవై యున్నావు? నీకు కల్యాణము సమీపించుచుండ నిటుల నుండదగునా?

కోకి—చెలీ! నేను కఠినహృదయనగుటంజేసి యింకను జీవించి యున్నాను. క్షమింపుము. తప్పక నాదారి నే బోయి చూచుకొనియెదగాక?

మంజు—నే నిక మాటాడజాలను.

కోకి—మంజుభాషిణీ! సకలంబు నీ వెఱింగియు నిటుల ప్రశ్నించుట తగునా?

మంజు—సకలంబు తెలియుటచేతనే నే నట్లడిగితిని. నేను పలికినదాని యం దసత్య మేమున్నది? నీతండ్రి వరుని తోడితెచ్చుటకై దేశాంతర మిపు డేగలేదా? నీ వివాహమునకై సకలప్రయత్నంబు లిపుడు జరుగుచుండుటలేదా? ఇం దసత్య మేమున్నది?

కోకి—నావివాహమునకై కాదు సకల ప్రయత్నంబులు జరుగుట, ఈప్రపంచమునుండి నాదు వియోగమునకు.

మంజు—కోకిలా! ఏల నీవట్లు నన్ను క్రొవ్వాడిములుకులచే బాధించెదవు?

కోకి—ములుకులేమి? ఇది యుద్ధభూమికాదు. ఇందెవ్వరును యోధులు లేరు.

మంజు—ములుకులుగాకున్న నీ వాడునవి పలుకులా? నీయుదంతె మిపుడు నాకు వెల్లడియైనది. నీవు ముగ్ధవైయుండ నీతండ్రి నీయుద్దేశ్య మెట్లు తెలియగలడు? ఎన్నడైన నా తెలియజేసితివా?

కోకి—చెలీ! నాతండ్రి కేగతి నే దెలుపగలను? నీవైన నాలోచింపుము. లోకములో నందఱివలె తల్లికి బిడ్డయభీష్ట మెఱింగించుట మొదలే లేదుకద? పోనిమ్ము. ఏరీతినైనను సాహసించి నాకోరిక నాతండ్రికి తెలియజేసెద ననుకొమ్ము. అత డందుల కంగీకరించునా? అది కలలోనైనను కల్లకదా! అతడందుల కంగీకరించనినాడు నేనెట్లు జీవింపగలను, చెలీ!

మంజు—అదియును సత్యమే. అయినను మన ప్రియసఖి పుష్పమాలిక రానిమ్ము. మువ్వురముగూడి కర్తవ్య మెద్దియో యాలోచింతము. (పుష్పమాలిక ప్రవేశము.)

పుష్ప—సకియలారా! నమస్కారంబులు.

మంజు—పుష్పమాలికా! నీ వింక నూరేండ్లు బ్రతుకుదువే! ఏలయన, గా, నిన్నుగుఱించియే మే మిప్పు డింకను పుష్పమాలిక రాలేదేమని ప్రసంగించుకొనుచుంటిమి. మాటలోనే వచ్చితివి చెలీ!

పుష్ప—చెలీ, మంజుభాషిణీ! భూమి యందు కాకి చిరకాలము బ్రతికి యుండినప్పటికి నేమి ప్రయోజనమేమి! ఇదియేమి! మన నెచ్చెలి వదన మింత వాడియున్నది? ఈ సకలరాజ్యసంపద నెట్లు నేలుటయని విచారించుచున్నదా?

కోకి—పుష్పమాలికా! రాజ్యసంపదయేమి? ఏలుటయేమి?

పుష్ప—కోకిలాంబ! నీవు మారాణివికదా!

కోకి—అది యెట్లు?

పుష్ప—మంజుభాషిణీ! చూడవే! మన చెలి యేమియు తెలియని ముగ్ధవలె ప్రశ్నించుచున్నది. మరల నానోట విని యానందించవలెనన్న నెపముగా నున్న మరేమి?

మంజు—నీవు మాట్లాడు దాని కేమియును సందర్భము లేదు.

పుష్ప—అవును. సత్యము. నేను చెప్పుదానికి సందర్భానుసారంబుగా మాట్లాడిన సందర్భంబు కలుగును, లేకున్నయెడల సందర్భ మెటులుండును!

కోకి—మాకేమియును తెలియదు. సతోదా!

పుష్ప—సఖి! అయితే వినుము. చెప్పెదను. వీరసేనున కిప్పుడు ప్రాణముల మీఁదికి వచ్చియున్నది. ఇక జీవించుట సున్న. కనుక తన తదనంతరము సుందరసేనుఁడు రాజుగ నుండవలెనని రాజచట్టంబులలో నియమింపఁబడెనట! నియమింపబడుట యేమి! ముఖ్యముగా సుందరసేనుఁడే రాజు కావలెను. లేకున్న వీరసేనున కింకను నీదు సఖునికన్న నాప్తులెవ్వరును లేరుకదా.

కోకి—చెలీ! యేమేమీ! వీరసేనుఁడు మరణించునా? తరువాత నా చెలికాఁడు రాజ్యమేలుటకు సంసిద్ధుఁడుగ నున్నవాఁడా? హా! ఇక నా సఖుని జూచుట సర్వాబద్ధము. ఇంతలో మాదు ప్రేమానుబంధము లిటుల తుంపబడునని నే నెన్నఁడును కలయందైనను తలచలేదుకదా. హా విధీ!

మంజు—చెలీ! కోకిలాంబ! నీచర్య లంతకంత కత్యంతవిపరీతములుగ నున్నవి. లేకుండిన నీసఖునికి రాజ్యసంపద ప్రాప్తించునని వార్తవిని సంతోషించుటకు మారుగా నీవు దుఃఖించుచుంటివి. నీవంటి కాంతలను మేమెచ్చటను జూడలేదు, చూడము, చూడబోము.

కోకి—అవును. నాయంతటి దురదృష్టవంతురా లీ లోకములో పుట్టలేదు. మఱి యిక పుట్టబోదు. కనుక మీరు నావంటి కాంతల నిక జూడబోరు. నాచెలికాడు రాజ్యమేలునంతలో నేను రాణినికా బోయెదనని మీయభిప్రాయము గాని యెన్నటి కారీతి జరుగ నేరదు. మీరువినలేదా! 'తమతమ నెలవులు తప్పిన తమమిత్రులె శత్రులౌదు' రవనియందని బుధులు నుడువగా రాజ్యము ప్రాప్తించిన తరువాత నాచెలికాడు పూర్వప్రభంగి ప్రేమ జూపడని నేను త్రికరణశుద్ధిగా జెప్పగలను. (ఉస్సురని నిట్టూర్పుదీసి) చెలులార! నాకిమియును దేహములో స్వస్థతగా లేదు. మీరు మీమీగృహంబులకేగి తరువాత రండు. (చెలులు నిష్క్రమింతురు. కోకిలాంబ విచారించుచు)

క॥ నాసఖుడు నృపతియైనం
మాసఖ్యం బౌతఁ డంతె మఱచునొకొ నా
యాసలు గంగకలియునొకొ
లౌనుమిమ్మా యేమిసేయనయ్యెదు నకటా॥

(అని నేలపైబరుండును.) (సుందరసేనుడు ప్రవేశించును)

సుంద—నే డేమికారణంబుననో కాని నాదు చెలిమందిరము చిన్నబోయియున్నది. ఇంతకు మునుపు నేను వచ్చినప్పుడెల్ల నిచ్చట జూచిన వీణావాద్యంబులతోను శారికాశుకవినాదంబులతోను నీభవనంబు విరాజిల్లుచుండెడిది. నేడేల యిట్లు కళాహీనమాయెను! (ఇటునటు నలుదెసల పరికించి) ఏమి! నాచెలి కోకిలాసతి

నేలపై బడియున్నది! ఎవ్వరేమి యపకృతి నాచరించిరి?
కోకిలాంబ! నీ విట్లుండుటకు కారణంబేమి?

సీ॥ ఏలకో నెరుగన ♦ య్యో శశివదన యింతి
యాకృతిని కళావి ♦ హీనయయ్యె
నేఁకో నెరుగన ♦ య్యో కమలాక్షి సుశీల
నా పికభాషిణి ♦ తాపమొందె
నేఁకో నెరుగన ♦ య్యో మదీయకులసతి
కలకంఠి యాగతి ♦ కలతఁజెందె
నేఁకో నెరుగన ♦ య్యో నిపుణ ప్రియసఖ
మందిరంబున నేఁడు ♦ మాన్పుకలిగె
ఆ॥ వె॥ కారణంబు నేను ♦ గనజాలకున్నాడ
సకియకెవరు హాని ♦ సలిపిరొకొ
మగువగతినిజూడ ♦ మనమున నాకెంతొ
చింతకలుగుచుండె ♦ జెప్పనేల.

(దగ్గరకుబోయి) చెలీ! నేను నీచందముజూడ నామానసంబున తత్తరపాటొదవుచున్నది. దయచేసి నీయొక్క దుఃఖకారణంబు నాతో జెప్పకున్న నే నిలువజాలను.

ఉ॥ ఇంతిరో! యింతచింత మది ♦ నేటికి జెందఁ! బిరాన లేచి నీ
కాంతుని సంతసంబునను ♦ కాంచవదేమి చలంబుమాను నీ
వంతలు బాపెదన్ చెలియ ♦ సంతమదేటికి నిన్నుజూడ నా
స్వాంత మదెంతయో కలత ♦ పాలగుచున్నది నన్నుగావుమా.

ఏల నీవెన్నడులేని వైరము నాయందుబూనితివి? నాయెడల నీకు బంతమేల? లేదు, లేదు. నీవేమో పరిహాసమునకును నా మనంబరయుటకుగాను చేయుచర్యలుగాని లేకున్న నేను నీయుండ నున్నంతవరకు నీకెవరేమి యపకృతినొనర్ప సాహసించెదరు? చెలీ! కోకిలాంబ! నేనిక నిలువజాలకున్నాను. నీదుఃఖము నా దుఃఖముగాదా? నీప్రాణము నాప్రాణముగాదా? నేను నీ వాడనుగానా!

తే॥ నీదు సుఖమును దుఃఖము ♦ న్నియును నావి
గావె! నాదగునర్ధాంగి ♦ కావె నీవు
కనుక నేను నీవాడను ♦ కినుకమాని
నన్ను దయచేసి బ్రోవుమా ♦ నళిననయన!

కోకి—నాథా! నాకెవరేమియు నపకృతి నాచరించలేదు ఈ మీసేవకురాలియందు మీరింత నిర్దాక్షిణ్యమూనెదరని నేనెన్నడును తలంచలేదు.

సీ॥ ప్రాణేశ! సుందరీ ♦ పంచబాణాకారి!
మీరాకకై నేను ♦ గోరుచుండ
నేలకో తెలియద♦య్యె మదినేలకినిసి
రో తప్పదేమి యీ ♦ నాతియందు
శ్రితజనపోషణా! ♦ హితజనభూషణా!
పాడియే మీకిటు ♦ వంతగించ
జన్మంబునుండియు ♦ సఖులమై సతతంబు
మితిలేనిప్రేమమై ♦ మెలగుచుండ
తే॥ తుదకు హానాథ నన్నిట్టు ♦ లదయుడవయి
మఱువ నేకాకినై యేను ♦ మదిని కుందు
చుండ కలిగెనా కరుణామ ♦ యుండ యీది
నమ్మ్రనకు తావకకరుణ ♦ నాటి కిపుడు.

సుందర—సఖీ! నీవేల యీలీల బేలవై యూరక చింతిల్లెదవు?

కోకి—నాథా! మీచిత్తము. నమ్మ్రనదానను. మఱియు కొండొక సమాచారంబు వినియుంటిని. అందువల్ల నామనంబున జనించు దుఃఖంబునకు నే నిలువజాలకున్నాను.

సుందర—సఖీ! అదేమి సమాచారము? విన్నవింపుము.

కోకి—ప్రాణనాథా! మీరు వీరసేనుని తదనంతరంబు రాజ్యమేలెదరట.

సుందర—సఖీ నీకది మేలుగాదా!

కోకి—ప్రస్తుతం బది మేలువలె గాన్పించునుగాని మీరే రాజ్యభరము వహించినచో తుది నెన్నియో నరకంబులు వాటిల్లగలవు. ఎవ్వరైన నేదైన నొక కార్యం బాచరించు నెడ తొలుత యుక్తాయుక్తంబులారయవలయు. వీరసేనునకాప్తులు మీరు తప్ప నింకొకరెవ్వరును లేరుగద? కళావతిమాత్ర మున్నది. ఆమెను తమకిచ్చి పాణిగ్రహణం బొనర్చి యీ రాజ్యమునకెల్లను బట్టము గట్టెదరు. అది కడుయుక్తమైన విషయంబు. ఏలయన, కళావతి మనకు గూర్చు సకియ. ఆ తరువాత తమరు రాజుగనుండి రాజ్యమేలుటతో సదా రాజకీయవ్యవహారములయందే బుద్ధి బొనపి ప్రజానురంజకముగా దుష్టనిగ్రహంబు జేయుచు శిష్టరక్షణంబునకై స్వసౌఖ్యంబులనైన బరిత్యజించవలయును. ఇటుల పరిపాలించుట కెంతటి ధీమంతులు గావలెను? అయినప్పటికీ సర్వజనానురంజనంబుగా బరిపాలించుట బహుకష్టతరంబు. అట్లు పాలించినగాని జనులెల్ల రానందింపరు. జనులెల్ల రానందించినగాని యీదేశ దేవుండు, జగన్నాటకసూత్రధారి, యానందింపజాలడు. కనుక సర్వభోగభాగ్యము లనుభవించెద మని యాశతోడ రాజ్యభారంబు వహించి కడుకష్టంబులకు లోనగుటకంటె వల్కలాజినంబులు ధరించి వనంబులకేగి, కందమూలఫలాదులను భక్షించుచు స్వేచ్ఛావిహారము సలుపుచు నల చిదానందస్వరూపులగు పురాణదంపతు లుమామహేశ్వరులకరుణ నతిశీఘ్రముగా బడయగలము.

సుందర—చెలీ! నీ వెప్పుడును కనుదూర మాలోచించుచుందువు. నాకు రాజ్యభారము ధారవోసినను గైకొనువారెవ్వరు?

కోకి—అది యెట్లగునాథా? ఆ కళావతి—మనప్రియసఖ—ముఖమైన జూచి దయచేసి గైకొన ప్రార్థించెదను.

సుందర—నేను నిన్ను నమ్మియుండగ, చెలీ! కళావతి నెటుల పరిగ్రహించు మనుచుంటివి?

కోకి—నాథా! కళావతి మొదటిది. ఉత్తమరాజవంశంబున జనించిన రాజపుత్రిక. ఆమె ప్రిప్రథమురాలు. పిమ్మట నేను.

సుందర—కళావతిని పరిగ్రహించుమని చెప్పి యేకపత్నీవ్రతమునకు భంగము కలిగించెదవా?

కోకి—నాథా! మీరటు లనవలదు. మీరు కళావతిని పరిగ్రహించనిచో మీం నేనుని యాత్మ సౌఖ్యము చెందనేరదు.

సుందర—చెలీ! యేది యెట్లుండినను నీవు నాకు బుద్ధులు గరపు నా యదృష్టదేవతవు గాన నీవే నాకు ముఖ్యము. మఱియు నీతండ్రి మంత్రియగుగ్రపు వచ్చినవెనక సర్వంబు తెల్లంబగును. అంత వరకు నాంగి యుక్తాయుక్తంబు లారయవలయు. నీతండ్రిగారు వచ్చినవెనక నాకిరాజ్యము వలదని బ్రతిమాలి వేడుకొని యెద. తరువాత దైవచిత్తము.

కోకి—నాథా! మీరు అంలుత నే రాజ్యంబు వలదని నాదు తండ్రికెరుక పరచవలదు. మీరు రాజుగ నుండునెడ నాతండ్రి మీ పలుకుల కతిక్రమింపనేరడు. తరువాత మీయిష్టము వచ్చిన తీరున నావివాహవిషయంబులు ప్రసంగించి జరిపించ గలుగు దురు. ఆ తరువాత మన యిష్టమువచ్చినట్టుల స్వేచ్ఛావిహార మున జీవయాత్రసలుపుటకై సకలప్రయత్నంబులు సేయ వచ్చును.

సుందర—సఖీ! ఇదియు నుపాయమే గనుక నీవింతటిదాని కేల యింత చింతించవలయును?

ఆ॥ వె॥ మగువ నీవిట కొర ♦ మాలినచింతల
యేల చివికి చివికి ♦ యిత్తరి నిటు

మైదొడవులు దీసి ♦ మలినవస్త్రము దాల్చ
గాంచు నాకు దుఃఖ ♦ కరముగాదె!

నీయిచ్చవచ్చినటుల మెలంగెదను. నీ వా నందనంబున నుండుము. నేను నిన్ను కలయుండై నను మరువను. కన్నుల గప్పకొని యెద. ప్రియసీ! నీ విప్పుడు సకలాభరణభూషితవై రమ్ము. ఉద్యానవనంబున కేగుదము.

(కోకిలాంబ నిష్క్రమించును.)

(తనలో) ఈరమణి నేనే రాజ్యము పాలించినచో కళావతిని వివాహమాడిన పిమ్మట తన్నెక్కడ మఱతునోయని విచారముతో నుండు చున్నది. అయినను స్వభావమున సుగుణశీలయగుటంజేసి తన యంతరంగంబున నుండు విచారము నాతో వెల్లడి చేయజాలకున్నది. మే మిరువుర మిట్లు పరస్పర మోహావేశమున నెన్నాళ్ళు దినంబులు గడుపుట? మంత్రీంద్రుడు వచ్చినవెనుక సకలకార్య పర్యవసానంబులు తెలగలవు. అదిగో! నాచెలి పిలుచుచున్నట్లున్నది.

(నిష్క్రమించును)

---

ద్వితీయ రంగము

మంత్రి ప్రవేశము.

మంత్రి—నేను సోనాపురమునుండి పెండ్లిప్రయత్నములన్నియు జేసి, వరుని తల్లిదండ్రులను బంధుమిత్రపరివారముతో నిటకు గొనివచ్చితినే. నే నీయూర కాలుపెట్టుసరికి రాజునకు వీరసేను నకు జరిమకాల మాసన్నమైనదన నే నెందరనోళ్లనో వింటిని. అట్లువిని తత్క్షణం బట కేగి వీరసేనుని జూచితినిగాని నాకైనను ధైర్యమేమియును జాలకున్నది. వీం సేను డీగండము గడచి నచో మరల తల్లిదండ్రుల కడుపులో పునర్జన్మము నొందె నను

కొనవలసినదే. నావంకజూచి చేయిసైగచేయుగా చెంతకేగితిని. ఏమియో మాట్లాడ జూచుచుండెను గాని మాట్లాడజాలకున్నాడు. కొంతసేపు మాట్లాడుట కనేకప్రయత్నంబులుచేసి తుదకు వీలుకానందున నావంక రెప్పవాల్పక చూచుచు కన్నీరువెట్ట సాగెను. హా! అతని మనంబుననుండుకోరిక నేనెట్టుల గ్రహించు వాడ? నేను యూరలేకపోవుటయు రాజునకీ ట్లాపద తటస్థించుటయు చూడజూడ రాజ్యంబున కెవ్వియో యనిష్టసూచకములై యున్నవి.

సేవ—(ప్రవేశించి) ప్రభూ! రాజనగరునుండి యెవడో సేవకుడరుదెంచి యున్నవాడు. మీతో నెద్దియో మాట్లాడవలెనని చెప్పుచున్నాడు.

మంత్రి—వాని నిట గొనిరమ్ము.

(సేవకుడుపోయి రాజనగరిసేవకుని తీసికొనివచ్చును.)

సుబుద్ధి—ఏమిరా! మనరాజుగారి కెట్లున్నది?

సేవకుడు—ప్రభూ! నిన్నటిదినముకంటె నేడధికంబుగానున్నది బాబూ! కంఠ్లన నిప్పుడు తెరచుటలేదు. మాట మునుపేలేదు. ఈలాగున్నది బాబూ, సమాచారము. అప్పుడప్పుడు కన్నులు తెరచి, లేచి, చుట్టునున్న జనుల పరికించుచు, నుస్సురని మరల శయనంబునందు కూలబడుచున్నాడు. తన తనయను కళావతిని చెంతకు బిలిచి ముద్దిడుకొనుచు ఆమెశిరంబు రొమ్మునై నిడికొని కంట నీరు వెట్టుచున్నాడు. ఇప్పుడు మిమ్ములను దోడ్కొని రమ్మన్నారు.

సుబుద్ధి—ఇదేమిరా? రాజు మాట్లాడజాలడని చెప్పుచుంటివే? నన్నెట్లు బిలిచెనురా?

సేవ—అదికాదు ప్రభూ! ఆయెదుట గోడపైనున్న మీపటంబును జూపుచు చేయిసైగలు చేయుచున్నాడు. ఆచేష్టలన్నియు చెంత

నన్న పరిజనంబులు కనిపెట్టి మిమ్ములను తక్షణంబ పిలువుడని నా కాజ్ఞాపింప నేనిటకు వచ్చియున్నాడ.

మంత్రి—అలాగునవా! హా దైవమా! వీరసేనుడెద్దియో నాతో జెప్ప కోరుచున్నాడు, గాని చెప్పజాలకున్నాడు. ఏమి చెప్పను? చెప్పిన రాజ్యవిషయం బేమి సేయవలెనో చెప్పను. రాజునకా పుత్రులు లేరు. పుత్రిక యొక్కతె యున్నది. ఆమెయైన నింక నవివాహిత. రా జప్పుడప్పుడు సుందరసేనుని విద్యాబుద్ధులు ప్రశంసించుచు, తన ముద్దులకూతును కళావతిని సుందరసేనున కిచ్చి వివాహముచేసి తనతదనంతరంబు రాజ్యము నాతని కర్పింపజేసెదనని పలుకుచుండెడివాడు. కనుక నేను సుందరసేనుని జూడవలెనని కోరికగూడ రాజునకుండవచ్చును. ఓరీ! నీ విప్పుడు పోయి సుందరసేనుని నేను బిలుచుచున్నానని యిటకు గొనిరమ్ము.

సేవకు—ఎవరు బాబూ! బంధికానాలో చనిపోయిన రాజకొడుకా?

మంత్రి—బంధికానాలో చనిపోయిన రాజెవరురా? మతిలేక మాట్లాడు చుంటివి.

సేవకు—పేరు నోట్లో తిరుగుచున్నాది బాబూ! మఱచిపోయినాను. చనిపోలేదు బాబూ?

సుబుద్ధి—ఛీ గాడిదె! ఎవరురా నీకు చనిపోయినారని చెప్పిరి? తెలివి తప్పినటుల మాట్లాడుచున్నావు. యాత్రకై వెళ్లెనా, చనిపోయెనా?

సేవకు—ఆ! మఱచిపోయినాను. యాత్రకు వెళ్లినాడు. (అని నిష్క్రమించును)

సుబుద్ధి—ఈగాడిదలకు ప్రతాపసేనుడు మరణించెనని సంగతి తెలిసియున్నది. వీరెక్కడను చాటింపలేదుకదా? లేదు, లేదు, భయముచే నూరకొన్నారు.

కోకి—(ప్రవేశించి) నాన్నా! యేల మీరిటుల విచారముగా నున్నవారలు?

సుబుద్ధి—అమ్మా కోకిలాంబ! మనరాజు వీరసేను డిప్పుడు గడియల మీద నున్నవాడు.

కోకి—ఆకళావతి, మాప్రియసఖి, ఎంతవిలపించుచుండునో కద!

మంత్రి—విలపించినను ప్రయోజనంబేమి? దైవకృత్యంబున కెవరేమి సేయగలరు!

కోకి—ఆహా! యెంతటి శోచనీయ మెంతటి శోచనీయము!

మంత్రి—కోకిలాంబ! చూడు మాదెస నెవరో వచ్చుచున్నట్లున్నది.

(కోకిలాంబ పోయిచూచును)

(సుందరసేనుడు ప్రవేశము)

సుందర—ఆర్యా! వందనంబులు. ఏల నన్నింత తొందరగా బిలువనంపిరి?

సుబుద్ధి—సుందరసేనా? నీ వా యాసనంబు నధిష్ఠింపుము. నీ మామకు వీరసేనున కిప్పుడు ప్రాణోపద్రవంబు ఘటియించుచున్నది. వైద్యులందరు సర్వచికిత్సలుచేసి యాశ లడుగంట నేమియును చేయజాలక మిణగరించుచున్నారు.

ఉ॥ సుందరసేన భవ్యగుణ ♦ శోభిత యీతటి నీకుమామకున్
ముందుల వైద్యసత్తములు ♦ నచ్చెరి సర్వచికిత్సలున్ గటా
పొందుగ నేమియున్ గుణము ♦ పొందకయుండ రవంతయేని హా!
క్రిందుగ నిన్నుజూచుటకు ♦ గాంక్షమదిన్ గొనియుండె నెంతయున్॥

సుందర—ఆర్యా! మనమెల్లే యేగుదము గాని యీసమయంబందు నాదుతండ్రి యుండిన నెంత సౌకర్యంబుగ నుండియుండును!

సుబుద్ధి—(తనలో) ఇంక తండ్రియెక్కడ? నీతండ్రి ముందు, తరువాత

వీరసేనుడు. (ప్రత్యక్షంబున) ఇక నీదుమామ రాజ్యభారమంత యునీ భుజపీఠంబునందు నిల్పుటకు సిద్ధంబుగ నున్నవాడు. నీ వందు కంగీకరించెదవా, సుందరసేనా?

సుందర—(తనలో) ఈతడు నేను లోకములో నందరివలె రాజ్యసంపదలకు నాశించెదనని నాతో చెప్పుచుండగాని నే నెన్నడును సంతోషింపను.

సుబుద్ధి—ఏమి, సుందరసేనా! మాట్లాడకున్నావు?

సుందర—ఆర్యా! నేను మరి యేకార్యంబునకైన నంతసించెదనుగాని రాజ్యము నాకు వలదు.

సుబుద్ధి—ఏల నీ వట్లు నుడివెదవు, సుందరసేనా?

సుందర—ఆర్యా! మీకు ధర్మంబు కలుగగలదు. వన్నివిధంబున స్వేచ్ఛగా జీవయాత్ర చేయనిండు. రాజ్యము వలదు.

సుబుద్ధి—సుందరసేనా! నీ వింకను బాలుడవు. నేజెప్పినట్లు చేయుము.

సుందర—ఆర్యా! మీరు చెప్పినటుల నేనింకను బాలుడను. నే నింతకష్టతరమైనకార్యంబు సేయజాలను. ప్రజలయొక్క సుఖదుఃఖముల కన్నిటికి రాజే బద్ధుడు. ప్రజానురంజకంబుగా పరిపాలించుట కింకను నాకు శక్తిజాలదు. నే బరిపాలించలేను. క్షమియించుడి!. మరియు రాజ్యంబున కే నెట్లర్హుండ నగుదును?

సుబుద్ధి—నీవుతప్ప మరెవ్వరును లేరు.

సుందర—అదేల నట్లునుడివెదరు! నాదుతండ్రి ప్రతాపసేనుడు లేడా? నాకన్న పెద్ద. ఆయన వచ్చినపిమ్మట ఆయనతో సకలంబు నాలోచింపుడు.

మంత్రి—(తనలో) మంచి విషమప్రశ్నలు వేయుచుండెనే! యింకెట్లు? (ప్రకా) సుందరసేనా! వీరసేనునకు నీయం దెక్కు డనురాగము. నీతండ్రి రాజ్యమున కింతకుబూర్వము చాలా వెతలు కుడిపెను.

ఆకారణంబుననేకదా కారాగృహంబున వసించువాడు. అట్టి నీతండ్రియొక్క ప్రజ లెక్కుడుభక్తితో నుండిరని విరసేనుని యుద్దేశ్యము. అందుచేత నీ కీరాజ్యంబు నిచ్చుచుండెను.

సుందర—నాతండ్రి సజీవుడై యుండగ నేను రాజ్యభారంబు వహించవచ్చునా?

క॥ ఆర్యా మీరిట్లు పలుకన్
కార్యాకార్యము లెఱుంగక ♦ కయెవో రేనీ
కార్యము నెట్టుల జేసెద
ర్యము వహియించి నాకు ♦ జనకుం డుండన్॥

సుబుద్ధి—సుందర సేనా! ప్రస్తుతము నీదుతండ్రి యిచట లేనపుడు నీవు రాజ్యభారము వహించి వీరసేనుని కానందము గూర్చవలెను. ఆతరువాత నీతండ్రి వచ్చిన వెనుక నీయిష్టము వచ్చినటుల జేయుము. మేము పెద్దవారము కామా? మామాట లించుకైనను నీవు వినవక్కరలేదా? సుందర సేనా! నామాటలెనను విని ప్రస్తుతము రాజ్యభరంబు వహించిన కడుపుణ్యము గట్టుకొనినవాడ వగుదువు.

సుందర—ఆర్యా! మీరు నాకీతగా జెప్పుట న్యాయముగాదు. అయినను త్రికరణశుద్ధిగ జెప్పువాడను. మీయానందము కొరకు వహించెదనుగాని నేనే యున్నటికిని రాజుగానుండి పలుబాముల కు లోనగుటకు గాదు.

సుబుద్ధి—సుందర సేనా! రాజపదవి కష్టతరమని పలుమారు పలుకుచున్నావుగదా, నీ వుత్తమక్షత్రియవంశంబున జనించిన వెందులకు?

సుందర—రాజవంశంబున జనించినవారందరు రాజ్యములనే యేలిరా? అట్లయినయెడ నాతండ్రి యిప్పటివరకే యేరాజ్యంబుల నేలినాడు? రాజ్యమేలుటకు నామనసొప్పదు. నాయిష్టముకువచ్చిన తీరున స్వేచ్ఛావిహారము జేయుచు నీవ్రపంచంబునం దేదైన

నొక ఘనకార్యం బాచరించి తుది నుత్తమలోకముం జేరి సర్వసుఖములను బడయవలయును.

సుబుద్ధి—సుందరసేనా! నీ కీవైరాగ్య మెప్పటినుండి జనించినది? వీరసేనుడు రాజాధిరాజు. నీమామ తన ముద్దుపట్టిని, కళావతిని, నీకు గన్యాదానము జేయవలెనని మనంబున నెంతయో నాసక్తితో నుండ నీవేమి సర్వసుఖముల బరిత్యజించు యతివలె మాట్లాడుచున్నావు!

సుందర—ఆర్యా! యొకటివెనుక నొకటి యడ్డంది నాగుండెతుకను నొయ్యకండి. నే నీహారంబులకుగూడ నోరంబియ్యోదను. మఱియు, ఆర్యా!

ఉ॥ శ్రీయుత రాజ్యలక్ష్మియు నశేషయశంబును సౌఖ్యమిచ్చునే?
న్యాయముగాదు సన్నిపుడు నాథుగ జేయుట రాజపుత్రికిన్;
తీయనిమాటలన్నలికి తీసెదరేల మదీయకంకణమున్;
హేయముకాదె తండ్రి స్పృశియించనిరాజ్యము నేను కోరుటల్!

(తనలో) ఆకోకిలాంబ పలికినటుల నొకటితరువాత నొకటి మెడకుగట్టజూచుచున్నాడు. నే నెంతజెప్పిన నీతండు వినకున్నవాడు. అయిననేమి? ప్రస్తుతము నేను కోకిలాంబ చెప్పినటు లంగీకరించుటయే మేలు. మరియు సర్వకార్యసాధనంబు. నేను రాజుగానుండినయెడల మంత్రి దుర్బుద్ధికూడ నామాట వినితీరును. అప్పుడు నాయిచ్ఛానుసారంబుగా నొనర్పగలుగుదును (ప్రకా) ఆర్యా! నేను జెప్పునదంతయు జెప్పితిని. మీయిష్టము వచ్చినటుల జేయుడు. మీచిత్తము నాభాగ్యము! నేను మీవాడను.

సుబుద్ధి—సుందరసేనా! నీవు పిన్నవాడవగుటచే నేటియు నెఱుంగకున్నావు. నావెంట రమ్ము. తొలుత నీదుమామను, వీరసేనుని, జూచుటకై నగరులోనికి బోవుదము.

పెంచెను. ఇకపిమ్మట తండ్రియైనను, దాతయైనను కళావతికి నీవేసుమ్ము.

సీ॥ శైశవంబున తల్లి ♦ చనిపోయె ననుచును
వీరసేనుడు దుఃఖ ♦ వివశుఁడగుచు
చిన్నతనంబునుం ♦ బియుఁ గళావతియని
పేరిడి యీమెను ♦ బెంచెఁజుమ్ము
కాంతిమేనెచ్చట ♦ కసుగందువోరాని
విరిసెజ్జనిడి యీమె ♦ బెంచెజుమ్మి
సుతయగునీమె నీ ♦ సతిగఁజేసెదనంచు
మోదంబున మదిని ♦ మురిసెఁజుమ్మి

తే॥ కటకటా మీ రిరువురును ♦ కలిసి మెలసి
యుండ ముద్దు ముచ్చటచూడ ♦ కుండ నేను
మనల దుఃఖసాగరమున ♦ మునుగఁజేసి
యరుగుచుండెను దివికి తాఁ ♦ గరుణమాలి॥

మఱియు,

క॥ స్తుతమతిస్త్రైరాజులు ని
సతిని గళావతిని ప్రీతి ♦ చాంతేర్ని
స్మృతి సమ... చ్చను విధి దం
పతులుగ నెటుబోత్రితా నిచె ♦ భారమున మిమ్ము॥

వీరసేనుడు—హా! రండు, రండు. ఈయాసనంబుల నధిష్ఠింపుడు. నాయనలారా! మీరేల నింతయలుక చెందినారు? తాతా జయచంద్రమా! నీవుకూడ వచ్చినావా? ఏమి నాయందు నీ కీయపారకృపారసము! ఇన్నాళ్లకు నేను స్మృతికి వచ్చితినా?

సుబుద్ధి—అమ్మా, కళావతి! యికను నీతండ్రియం దాశవిడిచి సుందరసేనుని నీనాథుని చరణంబు లాశ్రయింపుము.

గా వచ్చినందున వెడలిపోయెను. మనముగూడ గొలది కాలము లో నేగగలము. ఇందులకై వగవనేల?

సుబుద్ధి—సుందరి సేనా! నీవు వయస్సున చిన్నవాడవైనను, బుద్ధికి గడు పెద్దవాడవు. నీవు వచించునది నిక్కము.

కళావతి—హా తండ్రీ! మమ్ములను బాసితివా! నేము మేమేమి యపచారము గావించితిమి?

సీ॥ ఎంతకష్టపడితి ♦ వెంత యలసితయ్య
కాంచలేనిక నిన్ను ♦ గన్నతండ్రి!
తెలివిమియును నాకు ♦ తెలుపలేవుగదయ్య
గాంచు గతుల నిన్ను ♦ గన్నతండ్రి!
న్యాయమే సను నీకు ♦ నాకిడి సీవిటుల
కరుణ సుంతయులేక ♦ కన్నతండ్రి!
కరుణించి యిప్పుడైన ♦ గన్నులు విచ్చి న
న్నను గొనవేలకో ♦ కన్నతండ్రి!
తే॥ కోపమా! గాదు నాపూర్వ ♦ పాపములను
గాని యూరక కోపింప ♦ కాగ్రహించి మమ్ము
లకటు [illegible] ♦ లంచు నైతి
హీనదైవమా! యెంతలో ♦ నెంతలయ్యె!

హా! యింకను [illegible] నేల [illegible] మంచియున్నాను! [illegible]! [illegible]!
నాయనా! యేమి హృదయ మింత కఠినమయ్యెను! నన్ను
సి వెనువంట గొనిపోవక యేల విడిచి చనినావు? ఆహా! నేనం
తటి బేలను! నేను ఘోరపాపిని గాకున్న విధాత యిట్లు
[illegible] సేయునా? ఈగతి నిం కెన్నిపాట్లున్నవో కదా!

తే॥ హా! నృపవర! హా నాదగు ♦ సద్గుణేంద్ర!
హా కులతిలకమా! మదీ ♦ యార్థపీటి!
హా పురుషసింహా! యెచటికి ♦ వరిగినావు!
నిరసన నేనెటుల జీ ♦ వింతునయ్య!

సుబుద్ధి—సుందరసేనా! ఈవనిత దుఃఖమున కోర్వఁజాలకిప్పుడు మూర్ఛిత యైనది. మన విశ్రాంతికి త్వరితముగ నేగి ముందుగ నాతో నుపచారములు సఖియలచే చేయించి తగువారి సకల మాలోచించవలయును.

సుంద—మంచిది. అట్లే కానిమ్ము.

ఇది ద్వితీయాంకము



శ్రీ భవానీసహాయం

శ్రీ

# కోకిలాంబ

## తృతీయాంకము

### ప్రథమ రంగము

(కళావతి మందిరము)

కళావతి—ఆహా! నే నీవేదన కెట్లు తాళుదును! నాప్రాణము లేల పోకుండ నింక నిలిచియున్నవి! నాగుండె లేల యింకను వ్రయ్యలు గాకున్నవి! హా! నావంటి పాపాత్మురాలికి కోరునంతలో మృత్యువు చేకూరునా! హా నాయనా! పరమేశా! నన్ను మరచి నీ వొంటరిగ దివికేగితివా! నీ కేల యింత జాలిమాలితివి? నే నేమియుపచార మొనర్చితిని! హా తండ్రీ! నీరూప మొక్కసారి నాకన్నులయెదుట కనుపరచరాదా? ఇక నన్ను "అమ్మా కళావతీ" యని ముద్దులు మూటగట్టునటు పిలుచువా రెవ్వరు! నే నెందులకైన మది నలిగిన పరిపరివిధంబుల బరితపించుచు, నన్నూరడించు పుణ్యాత్ము లెవ్వరు? నా సౌఖ్యంబులే నీ సుఖములుగను, నాదుఃఖమే నీదుఃఖముగ, వేయేల! నీప్రాణములభంగి తల్లి చిన్ననాడె చనిపోయెగా యని యప్పుడప్పుడు విలపించుచు, నా కేవిధమైన కొరంతలులేక జూచు ధన్యాత్ముడవు తండ్రీ! నేడు యీహతభాగ్యురాలిని బాసిపోయితివా? ఆహా! కొరనోములు నోచి జన్మించినదానికి, మహాకలుషరాశి

కింకను తండ్రి యెట్లు జీవించియుండగలడు! నావంటి పాపాత్ము రాలీ ముజ్జగములలోఁ గూడ నింకొకతె లేదు. ఆహా! దైవమా! ఊరల నన్ను మూర్ఛావస్థనుండి యేల తెలివిగలిగించితివి! ఏల నామూర్ఛలో మరణనిద్ర కల్పించకపోయితివి! హా! నేనెంతటి యవివేకురాలను! నాకంతటిభాగ్య మీజన్మమందు లభించునా? వీరసేనా! నాయనా! నీవులేనియెడల నీమందిరములు రాజమందిరములా, గుడ్లగూబల కూజితములుగాక! నీవులేని దీ రాచనగరు తెల్ల నెందైన మంగళదాయకములుగ నుండునా! నీవు లేనిచో నీ రాచవీడు తెల్ల నెందైన రాణించునా! ఆహా! యెంతదారుణము వాటిల్లెను! కనురెప్ప వేయునంతలో నెన్ని మార్పులు జరిగెను! కలయందైన నిట్లు జరుగబోవునని తలంచ లేదు కదా! తండ్రీ!

(కమలావతి ప్రవేశము.)

కమ—చెలీ! కళావతి! గతియించినదానికై వగవ ప్రయోజనమేమి? ఇప్పుడు నీవు రేయుంబగళ్లనక శోకముచే నలసి సొలసి తలక్రిందుగ తపస్సాచరించిన[illegible]కైన నీతండ్రి వీరసేనుడు తిరుగ రాగలడా? ఇదియంతయు నల జగన్నాటకసూత్రధారుని మాయలు. వీనిని తెలిసికొని వర్తించుటకు మనుష్యమాత్రు లేపాటి?

కళా—సఖీ! కమలావతీ! నీవేమేమో నాకు వేదాంత ముపదేశించు చుంటివిగాని నాచెవి బడకున్నయవి.

కమ—చెలీ! నీవు దుఃఖపరవశమున మేము చెప్పునవి చెవినిడకపోయి నప్పటికి నీవిట్లనిశము విచారగ్రస్తవై యుండిన, కృశించి కృశించి కడు బడలెదవు.

కళా—సఖి! నీవు చెప్పు బోధనలు బ్రతుకదలచినవారలకు బనికివచ్చు నుగాని నాకేల?

కమ—చెలీ! నీవట్లనవలదు. నీవు లేని యెడల మేమెందులకిభువిని జీవనంబుచేయుట?

కళావతి—నీవిట్లేల మిత్రవైరము సాధించి నన్ను బాధించెదవు? నన్ను దయచేసి క్షమియింపుము. మఱియు చెలులెల్లరకు నేజేసిన తప్పులను మన్నించి నాదు కడసారి దండప్రణామంబులను స్వీకరింపుమనుము. చెలీ కమలావతీ! మీరెల్లరు నేను లేనికొఱంత మదిబెట్టుకొని దుఃఖింపక యథాగతిని సతతంబు సంతసంబున దినములు గడుపుడు. అయినను కొలదికాలము మీచెలి యొక నిర్భాగ్యురాలు, కలుషరాశి, యుండెనని మఱువకుడు. చెలీ! నన్ను బోనిమ్ము! విషము మ్రింగెద. లేదా యొంటైన గూలి యు తెమొనర్చుకొనియెద. (అని సాహసించును)

కమ—చెలీ! నిలువుము, నిలువుము.

కళా—నిలువనికలేదు. నాకు సెలవిమ్ము. కడకొకసారి నే బ్రణమిల్లెద. కాదు కాదు. జీవించు టుచితముగాదు. వలదు, వలదు. జీవింప వలదు. వలదు, నాకీరాజ్యము వలదు. సౌధములు వలదు సఖులు వలదు. భూషణంబులు వలదు. పతియు వలదు. ఎవ్వరును వలదు. నన్ను బోనిండు (అనిసాహసించును). చెలులాపుదురు. హా తండ్రీ! వీరసేనా! నాకీపాటిదైన స్వేచ్ఛలేకపోయె గదా! నీవైన వచ్చి గొంపొమ్ము, తండ్రీ! నాకింకెవరుదిక్కు? హా నాయనా! రమ్ము రమ్ము, రమ్ము. (అని మూర్ఛిల్లును).

(తెఱపడును)

---

ద్వితీయరంగము

(రాచనగరు. సుందరసేనుడు ప్రవేశము.)

సుందర—ఆహాహా! ఏమి! వీరల తెలివి! బుద్ధి బృహస్పతిని మించినటు లున్నది! రాజ్యమేలుట యేమో గాజులు తొడిగించుకొనుట

యని తలంచితిరి కాబోలు! యుద్ధంబులుసేయుట బొమ్మలాట యని యనుకొంటిరేమో? వీరల శాసనంబులు, చట్టంబులును భువిని యథార్థంబు లైనయెడల రాజ్యపరిపాలనంబునకు సుక్షత్రియవంశంబున జనించి శూరు డనిపించుకొను ధీరు డెవ్వడును బనికిరాడు. ప్రథమంబున నేకార్యము జేయుటలోనైన నశక్తుడు గావలెను. తరువాత స్త్రీలోలుడై యుండవలెను. తుదకు సమయము వచ్చినచో శత్రువులే పైబడిన, వారలకు దాసత్వము సలుపుటకు తెగియుండవలెను. ఆహా! యేమి వీరల బుద్ధిపటిమ! ఆ వీరసేనునకే చావు తెలివి సమీపించిన చెంతనున్న యీ కుమంత్రుల కేమియూడినది? ఇందు ఈ ప్రభుత్వంబున నొకడైన స్వతంత్రుడై యుక్తాయుక్తంబు లాలోచించు యోగ్యుడు లేడు. వీరల కెక్కడనుండి వచ్చును యోగ్యత? "యథా రాజా, తథా ప్రజా" యని పూర్వులు నుడివియే యున్నారు. వీరలందఱు స్తోత్రపాఠకులుగాని, సత్యమున రాజ్యపరిపాలనావిషయంబులలో రాజునకు తోడ్పడువారలా? ఇది మఱియొకసారి చదివెదగాక! (అని చదువబూనును)

వీరసేనుని తదనంతరంబు రాజ్యపరిపాలనాధికారంబు

స్థిరపఱచు శాసనమట!

"శ్రీశ్రీశ్రీ వీరసేనమహారాజపుత్రికుం డగుటం జేసి యుత్తరోత్తర రాజ్యపరిపాలనాధికారంబు తన ప్రియపుత్రికయగు కళావతి కియ్యబడినది. ఆ పెండ్లి రాజ్యంబు తన యిచ్చవచ్చిన రీతిన బరిపాలనంబు సలుపగలదు. ఒకవేళ కళావతి తన పిజేతునకు, వీరసేనుని జామాతకు, సకలరాజ్యంబు పరిపాలించుటకై యర్పించుట కధికారమున్నది. అట్లు రాజ్యంబెల్లను పరిపాలించుటకై కైకొనిన కళావతీపతి సకలరాజ్యంబును ప్రజానురంజకంబుగను, కళావతి సమ్మతంబుగను పాలించితీరవలెను. వీరసేనునిజామాత, కళావతీపతి, యిందుల కంగీక

రింపనివాడు, కళావతియిచ్ఛ నుల్లంఘించినవాడు, ప్రజల యనుగ్రహంబు తప్పినవా డంతఃపూర్వంబున రాజ్యంబు పాలించుట కర్హుడు గానేరడు. పాటియు రాజకీయవ్యవహారము లలో నిర్మింపబడు చట్టంబులన్నియు కళావతి కెఱుకపఱచి తనముద్రను బడయవలెను. లేదా రాజచట్టంబులు ఘోషించుటీరుగా దండనకు పాత్రుడు కాగలడు."

ఆహా! రాజకీయవ్యవహారములెల్ల కళావతి కెఱుకపఱచ వలెనట! కళావతియంగీకారవుముద్రను బడయవలెనట! ఇది యెంతలజ్జాకరము! కళావతిని వివాహమాడువా డంత చేతకానివాడా! కళావతి, వీర సేనుని పుత్రిక, రాజ్యమేలుటలో నంత బుద్ధికౌశలత కలదియా! ఉండవచ్చును. ఉండిన నిట్లు నియమింపబడుట హిందూధర్మమా? తగునా? ఇదియేమి యీమ మతియాలమని తలంచితిరికాబోలు! ఆహా! యెంతపరాధవ మెంతపరాధవము! ఇంక నేను వీరల కుపాండిత్యజనితపరాధ వవు మచ్చ నెట్లుతుడుచువాడ? "మంది ఎక్కువైన మతమునకుచే" టైనట్లు యీకుమంత్రిబృందమంతయు గూడి కుయుక్తు లాలోచించి, తుదకు రాజ్యము భ్రష్టుగ జేయుచుండిరి. వీరల కేగతి నైన నిక నర్ధచంద్రప్రయోగంబు లాచరించినగాని కార్యంబులు చక్కబడనేరవు. ఇంక నిటువంటి ప్రక్కలోనిబల్లెము లెన్నెన్ని నియమించియున్నారో కదా!

మఱి యిప్పుడు జాముతాత్రివేళ కావచ్చినది. ఇంక నేనా లోచించినపని చేయవలయు. నా చెలియగు కోకిలాంబకు రేవు గాక యెల్లుండిదినంబుననే వివాహమట. ఆపె యందులకంగీ కరించియే యుండవచ్చును. లేకున్న వివాహప్రయత్నంబు నెటుల మంత్రి సేయగలడు? అయిన నంగీకరించక యేమి సేయును? ఒక్కతె, ముగ్ధ. నే నిప్పుడే ప్రచ్ఛన్నవేషంబునబోయి నాచెలి యేరీతి నున్నదో చూచి వచ్చెదగాక!

(నిష్క్రమించును)

## తృతీయ రంగము

### (ఉద్యానవనము - కోకిలాంబ - ప్రవేశము)

హా దైవమా! చాలు, చాలు, ఈజన్మముతో నిఁకటిఫలము! మఱి యెన్నటికైన జన్మములు వద్దు తండ్రీ! నే నీపరితాపమున కిక భరియింపలేనుకదా! ఇప్పటికి నాల్గుదినములాయెను. నాను చెలికాడిచటి కొకసారైయైనను రాలేదుకదా! నే నాచారుమోహనాకారు, వలిజనమందారు, తరలముక్తాహారు జూడకున్న గడియ నిలువజాలను. నానఖుండు రానికతంబున నే నామన్మథుని బారి జిక్కి కడుబాములకు పాలగుచుంటినికదా! ఆహా! రతీ పతీ! నీ కేటి కీయబలలతోడి దీకయ్యము? ఆహా! చంద్ర! నీగుణము మానితివి కాదుగదా! నీబుద్ధి యెక్కడకుపోవు?

(పుష్పమాలిక ప్రవేశము)

పుష్ప—చెలీ! నీ వట్లొంటరిగ నేల యీయుద్యావనంబున కేతెంచితివి? అయిన నన్నుఁగూడ లేని యీరాత్రి నీ కేటి కయుద్యానవనవిహారము?

కోకి—చెలీ! పుష్పమాలికా! నే నీశరచ్చంద్రతాపమున కోర్వజాలక యి ట్లీయుద్యానవనోన్ముఖనై యేతెంచితిని.

పుష్ప—ఇదేమి చెలీ! సకలజనుల కానందము గొల్పుచున్న యీ చల్లని వెన్నెలను శరచ్చంద్రతాపమని నుడువుచున్నావు.

కోకి—ఆహా! నీకు చల్లని వెన్నెలా ఇది! యేమి నీ పక్షపాతబుద్ధి నీవుకూడ చంద్రునిసఖివా? చెలీ! నీవు నాచెలివలెనే యుండి తుద కాచంద్రునిపక్షము జేరితివే! నేను నీయెడ నొనర్చిన తప్పిదమేమి? ఆహా! నేటినుండి నీవుకూడ నొక పాంథపీడనివే కదా! మరి నేటినుండి నేనుగాను నీ చెలియను. ఆ మన్మథుడు, చంద్రుడు, వసంతుడు మొదలైనవారలెల్ల నీమిత్రులు.

పుష్ప—చెలీ కోకిలాంబ! నీ విరహవేదనచే నట్లునుడివెదవుగాని, నేను నీకేమియుపకారము జేసినదాననా?

కోకి—నీమిత్రులదకేమి చేయుచున్నారో నీవుకూడ నద్దియే సలుపుచుంటివి. మంచిది, ఈనాటికి నీనామంబు సార్థకము జేసికొంటివా?

పుష్ప—చెలీ! అదేమి! అదియెట్లు?

కోకి—నీపేరించుక చెప్పుము.

పుష్ప—పుష్పమాలిక గాదా?

కోకి—ఏమిమాలిక? మరియొకసారి చెప్పుము.

పుష్ప—పుష్పమాలిక, పుష్పమాలిక.

కోకి—పుష్పములచే జేసిన మాలికగదా? పుష్పములనగా నేమి?

పుష్ప—పువ్వులు, కుసుమములు, విరులు.

కోకి—నీకవి పుష్పములు, కుసుమములు, విరులు. నాకవి ములుకులు నిశితశరములు.

పుష్ప—ఏమీ! చెలీ! పుష్పములు ములుకులా?

కోకి—ఏమీ! పుష్పములు ములుకులు గావా? పుష్పాస్త్రుడు లేనే లేడా? వాడు నీచెలికాడుగాడా? నాకు వైరిగాడా?

పుష్ప—ఆహా! కోకిలా! చెలీ! నీమాటలు కడువిచిత్రములు.

(మంజుభాషిని ప్రవేశము)

మంజు—చెలులారా! మీరేల యీరాత్రికాలంబున దీయుద్యానవనంబున కేతెంచితిరి?

కోకి—చెలీ! మంజుభాషిణీ! ఆసూనాస్త్రుడు నన్ను తన పదునుకోలలచే బాధించుచుండ నేను కడు డస్సి యొందుండుటకు నెలవులేనందున నిటకు వచ్చితిని. ఇక్కడకుకూడ నన్ను బాధించుటకై తన చెలికత్తె నంపియున్నాడు చూడుము.

మంజు—ఏదీ మన్మథసఖయనుచుంటివి? యెచ్చట?

కోకి—ఇదిగో! పుష్పమాలిక!

మంజు—మన ప్రియసఖ పుష్పమాలిక నేల యట్లనుచుంటివి కోకిలా?

కోకి—పుష్పమాలిక యెవరు? పుష్పాస్త్రుఁ డెవఁడు? అందఱు నొకటే పుష్పమాలిక నేమో ముద్దరాలు, బాలిక యనుకొనుచుంటివా?

పుష్ప—చెలులారా! నాయందు మీ కింత కినుక వలదు. నే నిదె పోయి సరఃపాత మాచరించెద.

మంజు—చెలీ! నిలునిలు ఇదేమి మాటలు? మీ యిరువురి చర్యలు చూడఁగ నాశ్చర్యదాయకములై యున్నవి. మఱియు పుష్పమాలికా ప్రియసఖీ! నీ విప్పు డేల యింత యాగ్రహము చెందుచుంటివి? మన కోకిలాంబ మునుపటి కోకిలాంబగాదు. ఆమె కోకిలాంబ! ఈమె మదనకోకిలాంబ! కనుక నీ వింతటితో వింతయలుక చెందవచ్చునా? మన మామె నోదార్చుటకై వచ్చి యీరీతి కార్యములు చేయవచ్చునా? సఖీ! నిలువుము. ఎందేగెదవు? అలుక మానుము.

కోకి—పుష్పమాలికా! నీ వింతయలుక చెందవద్దు. నేనే పోవుచున్నాను. చూడు డాచంద్రుని కించుకైనను బుద్ధిలేక నన్నేగతి బాధించుచున్నాఁడో! ఆహా చంద్రా! నిన్నా ముక్కంటి దక్షాధ్వరమున బడవైచినను నశియింపక బ్రతికి మమ్ముల నిట్లు బాధించుచుంటివి కదా! నీ పగతి కాంతల నలయించుచు తుదకు వారి యుసురంతయు పోసికొని చిరకాలజీవితుఁడవై వరలుచుంటివా? ఆహా! మాబోటిబోటుల నలయించుజన్మము నీదొక జన్మమేనా?

మన్మథా! నీవుగూడ నాయెడ నింతటిక్రూరత వహించవచ్చునా? అబలలమని తలంపక నన్నిట్లు నీ నిశితశరములచే బా

ధించుట పాడియా? ఆహా! వసంతా! ఏమి నీదార్ఢ్యము! వీర, లిరువురతోఁగూడి నీవు నామంటను రెట్టించుచుంటివిగదా. హా! నే నిక నిలువజాలను. చెలులారా! మీ కిక నిదె కడపటినమ స్కారంబని యోచింపుడు. నే నీపాంథపీడనుల బారినుండి తప్పి బ్రతుకజాలను.

సీ॥ ఏలర పొంగెదవు ♦ టిక్కత మన్మథ! నీదు
కందకావర మెల్ల ♦ కాలిపోను!
ఏలర వన్నెటు ♦ నేచెదు చంద్రి! నీ
కుటిలిత మెల్లను ♦ కూలిపోను!
మలయానిలమా! యేల ♦ మారణ సేసెదు
తుంటరితన మెల్ల ♦ కూలిపోను!
కోకిలమా! యేల ♦ కూసెదు నీదగు
నోటి క్రొవ్వంతయు ♦ నేటఁ గలియ!
తే॥ హా! ప్రియుఁడులేని కతమున ♦ నగ్గలంబు
గ నను గూళ్ళై నిర్దయ ♦ గదు సిలుగులు
పెట్టుచున్నవారలు గద ♦ ప్రియుడు వచ్చె
నేని వెలవెట్ట కేలనా ♦ యిట్టడు మిగుల్మ॥

మంజు — సఖి! కోకిలాంబ! నీ వి ట్లుమార్మికంబులుగూడ విరహ వేదనబడి తపించుచుండ చూపరుల కెల్ల చోద్యముగా నున్నది. మఱియును చెలీ,

శా॥ లేరే నీవలె కాంత లెంద రవనిన్ ♦ లేరే ప్రియుల్ వారికిన్
కారే కాంతలు వారుకూడ, తలపన్ ♦ గాంక్షింపరే కాంతులన్
ఈరీతిన్ మదిఁ బెట్టిచే నలతురే ♦ యెందైన నో కోకిలా!
వాకేమీ యవివేకులే మది దలం ♦ పరాదె యవ్వారినిన్॥

కోకి — చెలులార! నాకు మీరు గూర్చునకియలుగావున నన్నోదార్చు టకుగా మీ రెన్నన్ని యో పలుకుచుంటిరిగాని యవి యెల్లయు నామది కెక్కకున్నవి. నన్ను క్షమియింపుడు. నన్నుగుఱించి యిక

విచారించక మఱచిపోండు. నేటితో మన ఋణానుబంధము సరిక దాతుని విచారింపవలదు. ఇదిగో! మీ యెల్లరకు మనః పూర్వకంబుగ నమస్కారంబాచరించుచుదాన. మఱియును,

సీ॥ సఖులార! భరియింప ♦ జాలను; ఈమహా
పరితాప మిక నేను ♦ బ్రతుకజాల
మదనుని తూపులు ♦ మఱి నాదుతనువున
నిలువున నాటగ ♦ నిలువజాల
వానిమామయు మిట్టి ♦ పడి వేడివెన్నెలన్
దహియించుచుండగ ♦ తాళజాల
మలయాద్రిపవనంబు ♦ మంటను హెచ్చింప
మఱి నేను బ్రతికుండు ♦ మనగజాల
తే॥ పూని నాయుసురంతయు ♦ బోసికొనుచు
చెలంగి పాంథసంపీడనా ♦ చనంబు
సేయునిందు సఖులార; ♦ సెలవునిందు
వింత మొకటికె కడసారి ♦ దండమమ్మ॥
(మూర్ఛిల్లును.)

మ జా — పుష్పమాలికా! నీ విపుడు త్వరితముగ నేగి జలంబులు గొని రమ్ము. మనచెలి మూర్ఛితయైనది. ఇప్పుడు తగు శైత్యోపచారంబులు మన మొనర్పవలయును.

(పుష్పమాలిక నిష్క్రమించును.)

ఆహా! మా చెలి యెన్నికష్టములు పడుచున్నది! ఆసుందర నేనుడు సింహాసనారూఢుండై నది మొదలు మఱి కనుపించుటయే సరుదాయెను. రేపుగాక యెల్లుండిదినంబున నీమెవివాహమని పుర మెల్లయెడల నలంకరించిరి. ఈమెజాడ నిట్లున్నది.

(శైత్యోపచారముల జేయుచుండును.)

(పుష్పమాలిక జలంబులు దెచ్చును.)

పుష్ప—ఇదిగో! చెలీ! జలము.

మంజు—ఏవీ, యిటగొనిరమ్ము.

(కోకిలాంబకు శైత్యోపచారంబుల జేయుదురు.)

మంజు—చెలి! పుష్పమాలికా! యేదోగానము మన వీనులకెంత మధురంబుగ వినవచ్చుచున్నదో చూడుము.

పుష్ప—ఎవరో పాడుచు నీదెస వచ్చుచున్నట్లున్నది. ఏలయన, గానధ్వని రానురాను హెచ్చగుచున్నది.

మంజు—ఆవంకకుబోయి కొంచెము చూడుము.

పుష్ప—ఇందెవరో నారాయణస్మరణంబుజేసికొనుచు మహాపురుషునివలె వచ్చుచున్నాడు.

(సుందరసేనుడు సాధువేషంబున "పాహి, పాహి, పాహిమాం! మురహరివర పాహిమాం" అని నమస్కరించుచు గానముచేయుచు వచ్చుచుండును.)

సుంద—(తనలో) ఇదేమి వీరు మువ్వురీ రాత్రికాలమున దీయుద్యానవనంబునందేమి చేయుచున్నారు?

మంజు—మహాత్మా! మాపాలిటి దైవమువలె నిచ్చట సాక్షాత్కరించిన మీరెవరో యించుక దయచేసి తెలియజేయుడు.

సుందర—నేనెవరినైన మీకేటికి? ప్రపంచముతో సర్వసంబంధములు విడనాడి యోగతి రేయుంబవళ్లనక నారాయణకీర్తనంబు సలుపుచు తిరుగాడు సన్యాసిని. అదేమి! యాపె నేలపై నించుక గ్రహపీడితయై పడియున్నది.

మంజు—మహానీయా! మీకీజగతియందగోచరంబు లెవ్వియును లేవు. మీరు మమ్ములను పావనులుగ జేయుటకై యిచ్చటకు విచ్చేసిన వారలు. మీరాకవలన మాజన్మంబులు ధన్యములైనవి.

కో—(మెల్లమెల్లగ లేచి) ఆహా! యీవేదనకు నేనెట్లు తాళఁదాన!

ఉ॥ ఎంతటి పాపకర్మముల ♦ నే నొనరించినదాననో కటా!
కంతునిపుష్పబాణములు ♦ కాఱియ వెట్టుచునుండ నిర్దయున్
కాంతుడు చుల్కచేసి నను ♦ గాంచనిచో సరిలేని నామది
త్వంతయు తాపనాన వెల ♦ యుంచిన వెన్నెలగాదె చూడఁగన్॥

ఆహా! మఱియు రేపుగాక యెల్లుండి తెల్లవాఱెనా, నాతండ్రి తన చిత్తానుసారంబుగా నన్నుల రత్నాకరునకిచ్చి వివాహము చేయనుండెగా. ఇఁక నేనేల జీవించియున్నాను?

పుష్ప—యతీంద్రమా! మాచెలికోట సర్వమువింటిరిగా! మఱియు మేము చెప్ప నదేమున్నది? అయినను మీకీజగంబున నగోచరంబు లెవ్వియును లేవు. రేపుగాక యెల్లుండి తెల్లవాఱెనా, యీమె తండ్రి, యీరాజ్యమునకు మంత్రి, వివాహప్రయత్నములు చేయుచున్నాడు. ప్రయత్నము లేమి? ఆమెను రత్నాకరుడను నాతనికిచ్చి వివాహంబొనర్ప నున్నవాఁడు. బాల్యమునుండియు చెలికాడై, సఖుడై, ప్రాణబంధువై కంటికి రెప్పవలె బరగు నా సుందరసేనునియందునుండి వియోగము కల్గుచున్నదిగదా యని విచారించుచున్నది.

కో—ఆహా! నేని వియోగసాగరము నెట్టు లీదుదాన! చెలులార మీరిఁక మీగృహంబులకేగుఁడు. నన్ను మఱచిపొండు. నేనెటు లనైన నంతంబు గావించుకొనియెద.

మంజు—పురుషపుంగవా! చూచితిరిగా మాచెలి చర్యలు?

పుష్ప—చెలీ! కోకిలాంబ! లెమ్ము. చూడుము; ఈమహాత్మునికి సాష్టాంగనమస్కారంబు లాచరింపుము తల్లీ! నీకోరిక కొనసాగగలదు.

కో—(మెల్లగ లేచి చూచి) మహాత్మా! నమస్కారంబులు.

సుందర—వనితాలలామ! నీదుఃఖముజూచి నేను సైపజాలకున్నాను, అయినను నీలోకమునందు మనుజులు పూర్వము వారివారి

కర్మానుసారంబుగా ఫలంబులను బడయుచుందురు. అందుల కై నీవు వగచిన ప్రయోజనమేమి?

మఱియు,

తే॥ అతివ! నీవిటు లేకాకి ♦ వై వనమున
జింతిలినను నీకాంతుని ♦ చిత్త మిపుడు
ప్రేమవహియించునో? కాని ♦ నోములకు ఫ
లంబును ఋణానుబంధము ♦ ల్గలుగకున్న॥

తే॥ ఉవిద! మంత్రిం(దుని) డాతని ♦ యుద్యమంబు
మొదలె విడువడు; తప్పదు ♦ పూర్వజన్మ
కర్మఫలమును పంక్తులు ♦ గాను దీర్చి
బ్రహ్మ నీదగు నొసటను ♦ వ్రాసియున్న॥

మఱియు నీకోరిక ఫలించుట కడు దుస్తరంబు. నాయల్ప జ్ఞానవిశేషంబు ననుసరించి నేను చెప్పుచున్నాను. కనుక యేల నీవింత విచారంబున పొలెదవు! ప్రయోజన మేమి?

పుష్ప—దేవా! మీరట్లనుడివిన మాచెలి యిప్పుడే ప్రాణంబులు విడు వగలదు.

కోకి—మహాత్మా! మీవంటి పుణ్యాత్ములచ్చటచ్చట నీ జగంబునందు ప్రబలియుండుట యెందులకు? మావంటి దీనుల గోడుల బాపుటకే గదా!

సుందర—అబలా! మే మేమిచేయువారలము? నేనును మీవంటి వాడనే! మీరైన నల పరాత్పరుని సమ్మిచరించినచో మీ శోకమును వాటిల్లజాలదు. అంతకు నల జగన్నాటకసూత్రధారుండుండ మావంటి మనుజమాత్రులచే నేకార్యంబులు చక్క బడగలవు?

కోకి—దేవా! మావంటి కలుషమతుల కంతటి జ్ఞానం బేయున్న నింకేమి?

మఱియు, నేజన్మంబున జేసిన పుణ్యావశంబుననో యీజగతిని మీవంటి మహాత్ముల దర్శనంబు లభించుచుండును. అప్పుడే కదా మేము మా పాపములకు పశ్చాత్తాపమునొందుచు మిమ్ములను త్రికరణశుద్ధిగ బూజించి, మీపాదధూళి శిరంబులపై జల్లుకొనిన మాజన్మ తరించును. కోరికలు సిద్ధించగలవు. తుదకు ముక్తినికూడ బడయగలము.

సుందర—రమణీ! నీ వేమిచేయగలవు? మే మేమిచేయువారలము? అల చిదానందస్వరూపుని మరువకుడు.

కో—దేవా! భవదీయ దర్శనంబువలన మాపాపంబులన్నియు నశించినవి. జన్మ తరించినది. ఇక మాకోరికలెట్టుల సఫలముగాకుండును? మమ్ములను ధన్యాత్ములగా జేయ నిచ్చట కేప్పుడు విచ్చేసిన మీకు మే మెంతయో కృతజ్ఞులము. భవద్దర్శనాత్పూర్వంబున నాకోరికలు కడుదుస్తరమైన నిప్పుడు కడసుకరమని తోచుచున్నవి.

సుందర—(తనలో) ఏమి యీగతి నుడువుచున్నది! నన్ను గుర్తించెనా యేమి! (ప్రకాశముగా) వనితలారా! నేనువచ్చి చాల తడవైనది. నేనిదె పోవుచున్నాడ.

కో—నాకోరిక సఫలమగుమార్గము నాకెఱింగింపకయె మమ్ముల బాసెదరా? న్యాయమా? నమ్మినదానను. నన్ను క్షమియించి రక్షింపుడు.

సుందర—తెలవా! అట్లయిన వినుము! చెప్పెద. నీవు శుద్ధమనంబున నేజెప్పు కార్యక్రమంబెల్ల నొనర్పుము. అట్లయిన కొంతవఱకు నీయభీష్టమును బడయగలవు.

కో—దేవా! కొంతవఱకేమి! మీకరుణగలిగిన పూర్తిగా సిద్ధించగలదు.

సుందర—అబలా! చెప్పెద వినుము. నీ సోదరుని గైకొని త్రికాలంబులయందు నీవద్దనుంచుకొని దానిపై లిఖయించియున్న

నామంబును సదా భక్తిపూర్వకంబుగా జపియించుము. చింత, లుడిగి యా జగజ్జననిపాదపంకజంబులనే సదా నీమనఃపీఠిని నిల్పి పూజలొనర్చుము. నీకుభీష్టము నెఱవేరగలదు.

కోకి—కరుణాకరా! నాదు వియోగసాగరంబునుండి నన్నుదరిజేర్చిన మిమ్ముల నేరీతి గొనియాడుదాన! దేవా! నేటినుండియు భవద్దాసురాలను. త్రికాలములందును మఱువను. కృతజ్ఞురాలను.

సుందర—వనితలారా! నేనిదె యేగుచున్నాడ. విశ్రాంతినుండుడు.

ముగ్గురును—(లేచి) దేవా! నమస్కారంబులు. (సాష్టాంగ దండప్రణామంబు లాచరించెదరు.)

సుందర—మంగళప్రద మగుగాక! మంగళప్రద మగుగాక! మంగళప్రద మగుగాక!

(సుందరసేనుడు నిష్క్రమించును)

కోకి—చెలులారా! మనమిక మన గృహంబుల కేగుదము రండు. రాత్రి చాలప్రొద్దుపోయినది.

(నిష్క్రమించుదురు.)

(సుందరసేనుడు ప్రవేశించును.)

సుంద—(తనలో) ఆహా! నా చెలి యెంత దుఃఖపీడితయై యిచ్చట నీరాత్రికడ కడువేదనకు పాలైయున్నది. ఈమెను మొల్లుండిదిన మున నల రత్నాకరునకిచ్చి వివాహము గావించెదరట. ఆహా! నేనెంత పాపమున కొడిగట్టుకొంటిని! నా చెలిని పరీక్షించుటకై ప్రచ్ఛన్నవేషంబున యతివలె నరుదెంచితిగాని నాశుద్ధాంత కాంత, నాసాధ్వీమణి, నాయకళంకచరితదుఃఖమునుజూచి యోర్వజాలకుంటి. అయిన నిప్పుడు విచారించిన బ్రయోజ మేమి? త్వరితముగ నగరునకేగి పెండలకడనే యల రత్నాకరుని జెఱసాలను వేయించవలెను. తరువాత కర్తవ్యమెల్లను నావధానచిత్తమున నాలోచించవలెను.



ఓం శ్రీభవానీసహాయం

శ్రీ

# కోకిలాంబ

## చతుర్థాంకము

### ప్రథమ రంగము

(రత్నాకరుడు ప్రవేశము.)

రత్నా—(తనలో) దినములు గడచినవి. వారములు వెడలినవి. పక్షములుపోయెను. ఆహా! నేటికి వివాహమహోత్సవము చేయుమాట తటస్థించెను. మాపురంబున నెల్లరును క్షామబాధచే కృశించుచున్నారట. నేనువచ్చి యిన్నిదినంబులాయెను, గాని నాకేమియును స్వస్థతలేదు. కంటికి పూర్తిగా నిదురలేదు. ఎట్లుండును, స్వగ్రామమంతయు సకలబాధాపూరితమైయుండ? నేను ఎడమకన్నారక బెదరుచున్నది. కారణం బరయజాలకున్నాను. ఇంకెట్టి విఘ్నములు, విపత్తులు రానున్నవో కదా! ఆహా! దీనబంధూ! జగద్రక్షకా! సకలమునకు నీవే మూలపురుషుడవు.

(రహిమాన్ సాహేబు, మహమ్మదుఖా ననునిద్దరు భటులు ప్రవేశము.)

మహమ్మదుఖాన్—తుమ్ ఐసా ఆప్. మై ఐసా ఆవూంగా.

రహిమాన్—అచ్ఛా! చలో! పక్డో! పక్డో! బందీకరో!

(అని రత్నాకరునిబట్టి బంధింతురు.)

రత్నా—అయ్యో! దైవమా! ఇదేమి క్రొత్త విచారము? మీరెవరు? సాయిబులారా! నేను దొంగను కాను.

రహిమాన్—అరే! మహమ్మద్! దొంగా, దొంగా, క్యారే ఘూఘూ! క్యాబాత్ హై రే?

మహమ్మద్—ఉస్ చోర్ నై బోల్తారే!

రహి—చోర్ గీర్ బేఫరూర్. హంజూర్ కా హుకూమ్ ఐసా బోలో.

రత్నా—సాయిబూ! ఏమిటేమిటి? అతడేమనుచున్నాడు?

మహ—ఏమీ లేదయ్యా! మీరు దొంగలైనా దొరలైనా మాకేమి? రాజావారి యొక్క యాజ్ఞప్రకారము మేము నడువవలెనంటూ యున్నాడు.

రత్నా—ఏమి! మీరాజుగారు నన్ను బంధించుమనిరా? నేనేమి నేరము జేసినాను? ఇది సర్వాబద్ధము. మీరు నన్ను గుర్తెరుగక యిట్లు బంధించుచున్నారు. మాది యీ యూరు కాదు. మేము మంత్రి సుబుద్ధిగారింటికి పెండ్లికి వచ్చియున్నాము.

మహమ్మదు—మంత్రి సుబుద్ధిగారు మీకేమౌతారు? ఏమనుగులా! ఆయన కూతురున కీరోజున పెండ్లికదూ!

రత్నా—అవును. ఈరోజుననే నాకిచ్చి వివాహ మొనర్చెదరు.

రహి—అరే! క్యారే! ఓహాచ్ జంగ్లి బాత్, మహమ్మద్! (రత్నాకరునుద్దేశించి) అజీమహారాజ్! బేఫరూర్ బాత్ మత్ బోలో! పహిలే జేల్‌ఖానాకు చెలో.

మహ—ఉస్ మంత్రికా బేటీకి శాదీ కర్నేకు ఓగాంకు ఆయారే!

రహి—అచ్ఛాబాత్! మగర్ పహిలే జేల్‌ఖానాకు శాదీకరో బోలో! మంత్రికా బేటీ, ఉస్కా జోరూ ఓసాబ్ ఝూటా, తుమ్‌కూ భీ ఖయాల్ నై క్యా!

రత్నా—(తనలో) ఆహా! దైవమా! ఏజన్మంబున నెన్నడు నే నెవరి వివాహమును విఘ్నంబు గావించితినోగదా, యిప్పు డనుభవించు చుంటిని! ఇదేమి? తెల్లవారకమునుపే రక్షకభటులు నన్ను వచ్చి బంధించి గొనిపోవుచున్నారే! కిండ్లీపెడాకులు లేకున్నను మంచిదే గాని, యిదేమి? యీబంధన! కారాగార ప్రాప్తియు. ఆహా! యీవార్త మాయూరచేరినచో పురజనులింక బ్రతుకుదురా? ఇంకెట్లు?

రహి—చెలో సాబ్! చెలో! దేరీ మత్ కరో.

(రామన్న, వెంకన్న ప్రవేశము)

రామ-వెం—సలాం ఆలేఖుం, సలాం ఆలేఖుం.

రహి-మహ—ఆలేఖుంసలాం, ఆలేఖుంసలాం.

వెం—మహమ్మద్ సాబ్! యిదేమిటిది తెల్లవారకమునుపు కేసు పట్టుకున్నారు!

రత్నా—అయ్యలారా! నే నేపాపం బెరుంగను. తెల్లవారకుండగనే వీర లిరువురు వచ్చి నన్ను హఠాత్తుగా బంధించి చెరసాలకు గొని పోవుటకు సిద్ధులైయున్నారు, చూడుడి.

మహ—హుజూర్ కా హుకుమ్ ఐసా. హమ్ క్యాకర్తే? అక్యా! మీ రేపాపమెరుగరని చెప్పుచున్నారుగదా! రండు, మా వెంట రండు. ఈసంగతినే యేలినవారియెదుట, సుందర సేనమహారాజు గారి దగ్గర చెప్పుకొని వెళ్ళిపొండి. మిమ్ముల నడ్డుపఱచువా రెవరు? బంధించువా రెవరు?

రత్నా—ఆహా! తలవ్రాత తప్పునా! (నడచును)

(మువ్వురు నిష్క్రమింతురు)

రామ—చూచేవురా యీవేళ సంగతిసమాచారము?

వెం—అవునా! మనమనుకొన్న దొక్కొక్కటి నిజమవుతున్నాది ? చూడు.

రామ—ఇంకేమిరా! రోజులు మారుతూ వున్నాయి. ఎల్లప్పుడు దినము లొక్కలాగుండవు.

వెం—వాట్ వుయ్ థాట్ బిఫోర్ అండ్ వాట్ వుయ్ సీ నౌ!

రామ—కోయిన్సైడెడ్!

వెం—యేస్, యేస్.

రామ—ఈదినమేకదూ వివాహము?

వెం—ఇంకేమి వివాహమురా!

రామ—ఇప్పుడు మంత్రిసంగతి, సుబుద్ధి టక్కరితనము, బోధపడతాయి.

వెం—ఈసమయములో సుబుద్ధి యేమిచేస్తాడో? మనమంతా చూసి దానికి తగిన ప్లాన్సు వేశి యేలాగైన మన మేష్టరు ప్రతాపసేనునకు సుందరసేనునకు చెప్పేయాలి. అప్పుడు చూడాలి సుబుద్ధిపని యేమౌతుందో.

రామ—అవును. పద పద. మంచిసంగతి జ్ఞాపకము తెచ్చేవు.
(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము.

(రాచనగరు—సుందరసేనుని ప్రవేశము.)

సుంద—(తనలో) రత్నాకరుని చెరసాలయందునిచిన సంగతి మంత్రి సుబుద్ధి కీపాటికి తెలిసియే యుండవచ్చును. తెలిసిన వెంటనే యిటకు రాకమానడు. అదిగో! ఎవరో యీ వంకకు వచ్చునటులున్నది.

(మంత్రి సుబుద్ధి ప్రవేశము.)

సుబు—సుందరసేనా! ఏమి! నేను నీవిటుల పల రత్నాకరుని నిష్కార ణముగా చెఱసాలయం దునిచినాడవు?

సుంద—రత్నాకరుడా! ఆర్యా! ఆ క్రూరునియెడ యేటికీకరుణ మీ కు! నిష్కారణముగ నేను శిక్షవిధించలేదు. కారణము కావ లసినంత యున్నది.

సుబు—అత నేనేర మెఱుంగడు. అతడు నిర్దోషి, సుందరసేనా!

సుంద—అయితే యిందు నేనేనా దోషిని? అకలుషమతి నిర్దోషియా! ఏమి యీ వైపరీత్యము!

సుబు—కాకున్న నతనియం దేమి దోషమున్నది? అత డొనర్చిన తప్పిద మెద్ది?

సుంద—ఆహా! ఆర్యా! ఆ దుష్టునిమాయలు నేను కండ్లారగాంచ బట్టిగాని లేకున్న మీ రిట్లేగదా దోషులనెల్ల దండననుండి తప్పించువారలు.

సుబు—సుందరసేనా! నీవే చూచినప్పుడు చెప్పరాదా?

సుంద—ఆర్యా! చెప్పిన ప్రయోజనమేమున్నది. మీరే నిర్దోషియని నిరూపించుచుంటిరిగా! మఱియు నా దురాత్ముం డొనర్చిన దౌర్జ టనియూ చెప్పువాడ!

సుబు—(తనలో) దైవమా! ఇదియేమి, యీగ్రహచారము! రత్నా కరుడు నాకు తెలిసినంతమట్టుకు సుగుణుడే! ఏమియొన ర్చినాడు! దైవమా! వివాహమునకై బంధుమిత్ర పరివారగణంబు లతో నిచ్చటకు రానిచ్చి తుదకు కారాగృహంబుననుంచిరని వా ర్త తన యనుచరులకే తెలిసిన నింక నన్ను బ్రతుక నిచ్చెదరా? ఇంక నేనేమిసేతు? (ప్రకాశంబుగా) సుందరసేనా! కోకిలాంబను రత్నాకరున కిచ్చి వివాహము సేయబోవునంగతి నీకు విశద మేకదా?

సుందర—ఛీ! కోకిలాంబ నాతుచ్ఛుని కిచ్చుటకు మీకెట్లు చేతులు వచ్చును? నేనతండు కడుదుర్మార్గుడని చెప్పినను నమ్మక మిగుల కోకిలాంబనిచ్చి వివాహము చేసెదననుచుంటిరే! నామాటలంత యలక్ష్యములా, రత్నాకరుడంత సుగుణశీలుడా?

సుబ—సుందరసేనా! నీవిట్లు పలికిన నేనేమిచెప్పవాడను? కోకిలాంబ వివాహమునకై గదా రత్నాకరు నిటకు దోడ్కొని తెచ్చితిని. ఇప్పుడు వాని నిట కారాగృహాబద్ధునిగ జేసినచో నా కెంత యపకీర్తియో నీవే యాలోచింపుము. ఇది శ్రేయస్కరమా!

సుందర—అపకీర్తియేమి! తానుజేయు దుష్కార్యఫలంబుల ననుభవించుచున్నాడు. మీరే యిట్లాచరింప లోకులు నుడువరా! కాబోవు జామాతయని కొండంతలు నేరము లాచరించినను గోరంతయైనను బాటిసేయరు. అదే యితరులెవరైన బీదజనులు నిష్కారణముగా నేరమేమియు జేయనప్పటికి గోరంతలు కొండంతలుచేసి వారలను కఠినశిక్షాపాత్రులుగ జేయుదురు. ఆనింద రాజునకు గాదా? ప్రస్తుతము నాదిగాదా?

సుబ—సుందరసేనా! కోకిలాంబవివాహభంగము జేయుట నీకు సంతోషమా?

సుందర—ఆర్యా! కోకిలాంబ నొక క్రూరునిపాలుసేయుట మీకు బంతమా! రాజ్యంబున నరాజకము ప్రబలుట యిష్టమా! చెప్పుడు.

సుబ—(తనలో) ఆహా! "ముందున నుయ్యి, వెనుకనుగొయ్యి" యను నట్లున్నది. (ప్రకాశముగా) ఇక నా కపకీర్తి రానున్నది. ఎవరు తప్పించగలరు? సుందరసేనా! రత్నాకరుని విడువవా? నేను నిందపాలగుట నీకిష్టమా!

సుందర—ఆర్యా! మీ రిట్లు పలుకవలదు! నా కేమినిందలు లేకుండుట మీకుకష్టమా? ఆహా! ఏమి యీ ప్రపంచము! నే నాక్రూరుని రత్నాకరునిపాటి చేసితినిగానా!

సుబు—సుందర సేనా! నీయిష్టము. (నిష్క్రమించును)

సుంద—ఆహా! సుబుద్ధీ! నీతనయుయభీష్ట మెరుంగలేకపోతి వే! నీవేటి మంత్రివి! ఈపాటి చేతగాకపోయెనే!

సేవకుడు—(ప్రవేశము) ప్రభూ! రామన్న యనునాతడు వచ్చి యేలిన వారితో నేదియో యెఱింగింపగోరుచున్నాడు. ఏలినవారి యాజ్ఞ యైనచో లోనికి గొనివచ్చెదను.

సుంద—వెంటనే కొనిరమ్ము. (భటుడు నిష్క్రమించును)

(రామన్నప్రవేశము.)

రామ—ప్రభూ! దండములు. కొన్ని నెలలక్రింద మాబంధుగులు కొందరు యాత్రార్థమై విదేశములకేగిరి. వారితో వెళ్లినవారు కొందరు నేడే తెంచిరి. మావారలెల్లరు నెటనో చిక్కువడి కడు వెతల గుందుచున్నారట. ఏలినవారు తమబిడ్డల గోడులు బాపి దయచేసి నాకించుక వారలనెల్లరను దోడ్కొని తెచ్చుటకై సెలవొసంగ ప్రార్థించుచున్నాడ.

సుందర—యాత్రార్థమై మీవారలందరు బోయియుండిరా! అప్పుడే నాతండ్రికూడ నేగియుండవచ్చును. ఆయనసమాచార మేమైన నీకు దెలియునా?

రామ—ఎవరు ప్రభూ?

సుందర—రాజా ప్రతాపసేన.

రామ—చెఱసాలలో గతియించినవారా!

సుందర—ఏమీ! చెరసాలలో నాతండ్రిగతించెనా! హా! ఏమి! నేడెంతటి కర్ణకఠోరమగు వార్తవింటిని! నిక్కమేనా! ఇన్నినాళ్లనుండి నాకొక్కరైన జెప్పరైరే. ఆహా! తండ్రీ! నీకెట్టిపాట్లుకలిగెనునాయన్నా! నీ వింకను నేన్నడో తీర్థయాత్రలనుండి వచ్చెదవని కన్నులు కాయలుగాయునటుల జూచుచుంటిని.ఆహా! మంత్రీ! క్రూరబుద్ధీ!

తులువా! గడియక్రిందట దప్పిపోతివి. లేకున్న నిన్నిచ్చటనే నీ యొక్క దుష్టబుద్ధికి తగు ప్రాయశ్చిత్త మాచరించియుందువాడ. ఏమి యొనర్చినాడ! నీ యెడ నేనెట్టిపాపం బాచరించినాడ! ఆధీరోదారుని, నాయనుంగుతండ్రిని, ప్రతాపసేనుని బరిమార్చుటకు మీచేతు లెటులాడెను! మీర లెల్లరు నాయనను గూలువ జాలు వారలా! ఆ శుద్ధమనస్కుని, శూరుని, మీ మాయలచే కపట కృత్యంబులచే జెఱసాలయందునిడి యెట్టకేలకు ప్రాణంబులను మ్రింగితిరి. కడుపునిండినదా! మీకోర్కెలు ఫలించెనా! అక్కటకటా! ఎంతటి ఘోరకృత్యం బొనరించితిరి. హా తండ్రీ! ప్రతాపసేనా! వీరలబాధ కెట్లు సైపనోపితివి! నీ వసహాయుండవగుటం జేసి నీ వెంత పరితపించితివో గదా! హా! యిక నాజన్మ మెందులకు! హా తండ్రీ! ప్రతాపసేనా! (అని మూర్ఛిల్లును. తెరపడును.)

## తృతీయరంగము.

(గంగాధరుడు-సుబ్రహ్మణ్యము ప్రవేశము.)

గంగా—సుబ్రహ్మణ్య! నీ విట్లు మంత్రిసుబుద్ధిని దూఱనాడిన నాకు గోపము వచ్చును.

సుబ్ర—నేను నిజము పల్కుచున్నాను! నీవేమో తన కూతురు పెండ్లి కిప్పుడు సంభావన లెక్కువగా దొఱకునని యాతనిని పొగడు చున్నావుగాని నేనందుల కొప్పుకొనను. తెలిసినదా! చూడుము. నిన్నగాక మొన్నను వీరసేనునిపని యేమైనది!

గంగా—ఆయువు మూడినవారిపని యేమౌతుందో యదే!

సుబ్ర—తరువాత సుందరసేనుడు రాజగునప్పుడు వీరసేనునిపుత్రికను కళావతిని వివాహము చేసుకొనవలెనని రాజచట్టంబులు దెల్పుచున్నవట. ఆ సుందరసేనునకు ప్రథమంబున వివాహ

మొదర్చక యీమంత్రి సుబుద్ధి తన కూతురున కేమి తొందర వచ్చిందో నేడు వివాహము చేయుచున్నాడు.

గంగా—చాలు చాలు. నీమాట లింక గట్టిపెట్టు. లోకమంతా రాజుతోనే యున్నట్లు చెప్తావు.

సుబ్బి—పోనీ! నాకెందుకు వివాదము. నడు నడు. సూర్యోదయమై రెండుగంటలు గడువు కావచ్చినది.

(రామన్న వెంకన్న ప్రవేశము.)

వెం—అయ్యో! బ్రాహ్మణులారా! ఏమి మీరింత తొందరిగా నెక్కడికి పరుగెత్తుచున్నారు?

గంగా—అయ్యలారా! మాతోను మీకెందుకు? మాపనిమీద మేము పోవుచున్నాము. మమ్ములను బోనియ్యండి.

వెం—మీపని మాకు తెలుసును. సుబుద్ధిమంత్రిగారింటికి పెండ్లివిషయమైగదా!

సుబ్బి—అవును! నాయనా! బాగా కనిపెట్టినావు.

గంగా—వా రెప్పుడు రాజగారిసంస్థానములో నుందువారు. వారికి తెలియనిదేమున్నది! (రామన్న వెంకన్నలంజూచి) అయితే సంభావన మేమాత్ర మివ్వదలచుకొన్నారు? మీ కేమైన తెలుసునా?

సుబ్బి—నీ సంభావన బంగారమైపోను! వడిగానడు! యీపాటికి పెండ్లి కొడుకుని వాళ్ళిసి కూర్చోబెట్టియుందురు.

గంగా—కూర్చోబెట్టడమెచ్చట? పెండ్లిపీటమీదనా?

రామ—కాదుకాదు. కారాగృహములో!

సుబ్బి—ఆదేమయ్యా మీరు రాలా గనుచున్నారు?

రామ—ఆహా! మీకింక తెలియదా యేమి! తెల్లవారకమునుపే రత్నాకరుని కారాగృహబద్ధునిగ జేసిరి.

సుబ్రి—ఏమేమి! కారణం?

వెం—దానికి కారణమంతా వేరేయున్నది. అదంతా మీకెందుకు, మీవారిని మీరుపొండి. (వెంకన్న రామన్న నిష్క్రమింతురు)

గంగా—నీకోరికయే ఫలించినదిలే! మంత్రిపుత్రికవివాహము నీకిష్టములేదన్నావు కావూ! నీనోట్లో నిజంగా శనిగాడున్నాడు. ఇంక మన మెందుకక్కడికి బుఱ్ఱమీద ముసుగువేసుకొని! తిరిగి వెళ్ళిపోవుదమురా! (నిష్క్రమించుదురు)

## చతుర్థరంగము.

సుందర—హా కుటిలాత్మకా! కుబుద్ధీ! క్రూరా! యెంతదేగితివి! నిన్ను తుత్తునియలుజేసి తుదకు కాకులకు గ్రద్దలకు నెగురవైచినను పాపములేదుగదర! నీవు నన్ను చిన్ననాటినుండి యత్యంతకరుణతో బోషించుచు జనకునిభంగి నన్నాదరించుచుంటివని మురిసితిని గాని, మూర్ఖా! నీవు గోముఖవ్యాఘ్రమవని కలనైన దలంచనైతినే! ఛీ క్రూరకర్మా! చండాలా! తుదకు మీరందరుగూడి నాజనకుని పాలిటి మృత్యుదేవతలైతిరిగదా! అకటా! యెంతటి ఘోరకృత్యంబాచరించితిరి! ఆహా! జననీ, కమలాంబ! నీవీదారుణకృత్యంబులనెల్ల కంట జూడకుండగనే యుత్తమలోకముంజేరి సుఖించుచుంటివి. కడు పుణ్యాత్మురాలవు తల్లీ! నా కాపాటి భాగ్యములేకపోయెనే! దుష్టుండు! యీకలుషుడు జననమొంది తల్లీ, నిన్ను దివికంపినాడు. తరువాత మున్న మున్నటివగకు తండ్రి పరితాపసీనుడు చెఱసాలలో నునుపబడి కడుని డుమలపాలై తుదకు నీతుచ్ఛులచేతిలో మరణించెనుకదా!

ఆహా! ఎంత భాగ్యహీనుడను, దైవమా! కోకిలాంబ! యీవార్త నీకైన దెలియకుండెనా యిన్నినాళ్లనుండి! నే నెంతయవివేకిని! నాహృదయేశ్వరికే యీసమాచారము తెలిసియుండినయెడల నాతో జెప్పక యూరకుండునా? తనకెట్లు తెలియును? ఆదుష్టబుద్ధి సుబుద్ధినామధేయుఁడు మాయలను బన్ని ప్రతాపసేనుడు యాత్రార్థమై వెడలెనని చెప్పెనుగా! నీ వెంతటికైన తగుదువురా తుచ్ఛా! నాతండ్రి యాత్రార్థమై వెడలెననిచెప్పి నాకన్నుల దుమ్ముగొట్టితివా! కాచుకొమ్ము, నిన్నేమిచేసెదనో! ఇదే చూడుము. ఏమి నీనిర్హేతుకజాయమానకరుణ! "నాతో వీరసేనుడు నన్నురాజుగాజేసి కళావతిని బాణిగ్రహణము జేయుమని" అని నొక్కినొక్కి వక్కాణించితివే! ఛీ! నీరాజ్యమేడ! నీ వేడ! నాతండ్రిని హత్యగావించిన చేతుల నీవు రాజ్యమొసగిన నేనింక గైకొందునా? ఈ వైరానలమును నే నెట్లు చల్లార్చువాడ! చల్లార్చువాడ నీదు రక్తప్రవాహమున నిపుడు. తొందరపడకుడు. వినుమిదె నాదు దీర్ఘప్రతిజ్ఞను:

సీ॥ ఏనే జనించితి ♦ నేని సుక్షత్రియ
వంశంబునందు; మ ♦ ద్వంశ్యులే స
దా యిల సత్యవ్ర ♦ తాచార సంపన్ను
లైన జనని కమ ♦ లాంబయే య
తివలలోన మహాప ♦ తివ్రతయైన; నా
తండ్రి ప్రతాపుడే ♦ ధరను శూరు
డేని యు నలవేల్పు ♦ టేలిక పార్వతి
కాళిక శివురాణి ♦ శూలపాణి
తే॥ గీ॥ యే సకలభువనములను ♦ నేలుచుండ
నేని తెల్లనేసెద కూరు ♦ ని జనకుని మ
రణముదాచిన యీమంత్రి ♦ రక్కసిని వి
గతశిరస్కుఁడై భూమిపై ♦ గూలునటుల॥

ఇది చతుర్థాంకము



ఓం శ్రీభవానీసహాయం.

శ్రీ

# కోకిలాంబ

## పంచమాంకము

### ప్రథమ రంగము.

(కాళికా దేవాలయము—మంత్రిసుబుద్ధి ప్రవేశము.)

సుబు—ఆహా! నేనొకటాలోచించిన దైవమొకటి చేసెగదా! నావెర్రితో నేడు నాకంటినే పొడుచుకొంటిని గదా! ప్రతాపసేనుని దుర్మరణము గుప్తపరచుట మున్ముందు వీరసేనుని రాజ్యమున కెవ్విధమైన యనర్థకములు ఘటిల్లవని, క్షేమాస్పదమని మదినెంచితిని గాని సుందరసేనునియందలి యీర్ష్యచేగాదు. మరియు నాడు నేనెద్ది యుక్తమని యొనర్చియుంటినో నేడద్దియే నాకు ప్రాణసంకటమాయెనే! మరియు సుందరసేను డిప్పుడు సకలంబు నెఱింగి యెట్టకేలకు నన్ను జంపి తన తండ్రి ప్రతాపసేనుని దుర్మరణమునకు బ్రతీకారము జేసినగాని నిద్రించనని కఠినశపథ మొనర్చెనట. ఆహా! చిన్ననాటనుండియు పెంచి పెద్దచేసిన నామీద నేడు ప్రళయకాలరుద్రునివలె బయలు వెడలెనట! జరుగనున్నది జరుగక మానదు. ఇప్పుడు రెండు జాముల రాత్రియైనది. సుందరసేను డనుదినంబు నీ జగజ్జనని దర్శనార్థమై యిటకేతెంచును. నేనిచ్చట కొంతతడవు డాగియుండి యీ విశ్వాసఘాతుకునిచర్య లారసి కర్తవ్య మాలోచించెదగాక. నన్నే వధించెదనని ప్రతినచేసిన పరమకలుషుని యెడ నక్కటికమూను టుచితము కాదు. మరియు నేనే,

తే॥ వీరసేనుని మంత్రిని ♦ యేని గూల్చు
వాడ సుందరసేనుని ♦ వానిని లఘు
ని పిదప సకలరాజ్యము ♦ నిచ్చువాడ
నాదు కోకిలప్రియునకు ♦ నయముతోడ॥

అదిగో యెవరో వచ్చుచున్నటులున్నది. (మంత్రి డాగును.)

(సుందరసేనుని ప్రవేశము.)

సుందర—హా! మాతా! జగదంబా! నమస్కారంబులు. తల్లీ! నీవే గురువని దైవమని నమ్మియుండిన తుదకు నాకువచ్చిన పాటులివి. నీవుగూడ నాపితాపసేనునిమరణ మెరింగియుండియు తెలుపలేకపోతివా! హా! నే నేమియపచారము నీకొనరించినాడ? నేనేమి విషముపెట్టితిని? ఆమంత్రిసత్తముడు నీకేమి నెయ్యంబాచరించినాడు? అహా! నీవు నాయెడ నింత నిర్దాక్షిణ్యము బూనట యెవరికినష్టము? నీదాసునేకదా బరిమార్పింపజేసితివి! నీ దాసానుదాసుసితండ్రినేకద, మరియెవరిని? ఆహా! నేనేమియింత తెలివిమాలి మాట్లాడుచున్నాను. నాదు జగజ్జననినిందించుచున్నానే. ఎంతటి పాపాత్ముడను! తల్లీ! నాతప్పులు మన్నించి క్షమియించుము. అక్రూరమంత్రి కుబుద్ధికతన తల్లీ! జగదైకరక్షణీ! నిన్ను నిందించుచున్నాడను.

చ॥ జయజయ పార్వతీ సకల ♦ సద్గుణదాయిని సర్వమంగళే
జయజయ శాంభవీ వశిని ♦ సర్వవశంకరి శ్రీమహేశ్వరీ
జయజయ చక్రస్వామిని సు ♦ సంపదపూరణి సర్వరంజనీ
జయజయ లోకమాత కుల ♦ శంకరి సుందరి నన్ను గావుమా॥

జననీ! సెలవొసంగుము. ఇదిగో నీదు పాదపంకజంబులనే నాదు మనఃపీఠంబున నెలకొల్పి సాష్టాంగదండప్రణామంబు లాచరించుచున్నాడ. (సాష్టాంగదండప్రణామంబు లాచరించుచు) నాకైకుటిలుని క్రూరాత్ముని బరిమార్చుటకై శక్తినొసంగుము తల్లీ!

పుబు—ఇదిగో నీకు ముక్తినిచ్చుచున్నాడ. (అని కరవాలమును సుందర

సేనుని జంపును.) నీవా నన్ను జంపువాడవు! చిన్న చిన్నటి బుడుతడవు నీ వెంతటికి సాహసించితివిరా! నీవు తీసినగోతిలో నీవే పడితివి.

ఏమియిది! యెవరో నన్ను ఖడ్గముచే చెండాడుచున్నారే! నాకండ్లు తిరుగుచున్నయవి. పాదములు నేల నానుటలేదు. అదిగో వచ్చుచున్నది, వచ్చుచున్నది. పులివాహనంబుపై వచ్చుచున్నది. హా చచ్చితినికదా! (అని నేలపైబడును)

(కోకిలాంబ ప్రవేశము)

కోకి—జగజ్జననీ! పరమేశ్వరీ! నీకు వేయికోట్ల దండప్రణామంబులు తల్లీ! నావలనకదా జననీ, నాతండ్రికిని సుందరసేనునకును నిష్కారణవైరము ఘటియించెను. ఆహా! ఈపాపిష్ఠి కోకిలాంబ యేల యీజగతియందు పుట్టవలె? పుట్టెబో! పుట్టిన సుందరసేనుతో నేల సఖ్యంబు సలుపవలయు? సఖ్యంబు సలిపెబో! సలిపిన నేల మోహపాశంబులకు బద్ధురాలు గావలయు? అయినను తండ్రి సుబుద్ధి యేల తన తనయాయభీష్టమునకు బద్ధవిరుద్ధుడు గావలయు? ఆహా! యింతవరకు వచ్చిన వెనుక నీ జీవమేమి సుఖింపగలదు!

(కాలికి సుందరసేనునికళేబరము తగులగా జూచి)

ఆహా! యేమిది! నాసఖు డీదేవిసమీపంబున నిట్లు జీవములువాసి పడియుండెను! ఇంక నాభవంబెందులకు! (సుబుద్ధిని తిలకించి) ఇదిగో! యిచ్చట నాతండ్రిగూడ పడియున్నవాడు. వీర లిరువు రిచ్చట నొండొరుల నంతము గావించుకొని యుండనోపు! ఆహా! సుబుద్ధీ! నాయనా! ఈకోకిలాంబ యెంతటి విపరీతములకు కారకురాలయ్యెను!

మ॥ ఇదియేమీ! యొకదిక్కునన్ పడియె ♦ నీర్గెన్ నాదు తండ్రీగతిన్
ఇదియేమీ యెవడాచరించె నిను నీ ♦ హత్యన్ గటా యిచ్చటన్
ఇదియేలా ఘటియించెనో యెఱుగ నే ♦ నిప్పట్టునన్ ఎట్లు జీ
వితనై యుండ గడంగుదో జనక నీ ♦ వే నేలపై గూలినన్॥

జననీ! కాళీమతల్లీ! సెలవొసంగుము. నేటితో సర్వము సమాప్తించినది. మరియు,

సీ॥ నేనే సదా జన ♦ నీ నీదు పాదపం
కజములు నమ్మిన ♦ కాంత నేని
సమ్మతంబుగ నిల ♦ సదయుడౌ నాతండ్రి
యానతిమీరని ♦ యతివ నేని
సదమలచరితుని ♦ సఖుని సుందర నేను
నే బహిఃప్రాణమ ♦ ని మదినెపుడు
దలచు సుసాధ్వీమ ♦ తల్లి నేని, జగతి
బంచభూతంబులె ♦ బరగు నేని

తే॥ గీ॥ విమలచారిత్రులౌ వీరు ♦ విగతజీవు
లు పతియు పితయు జీవము ♦ లు బడసెదరు
గాక నీదుకృపమహిమ ♦ కతన జేసి
కానిచో నొనర్చుకొనెద ♦ కంఠహతము॥

(అని కరవాలము నెత్తి కంఠహతము జేసికొనబూనును)

కాళీ—నిలునిలు, కోకిలా! నీదుభక్తికి మెచ్చితిని. ఇదిగో యిదె సజీవు లగుచున్నారు నీయాప్తులు.

కోకి—తల్లీ! పాహిమాం! పాహిమాం! పాహిమాం! (నమస్కరించి నిలుచుండును.)

తే॥ గీ॥ చిన్ననాటనుండియు తల్లి ♦ వీవెయంచు
నల శివునియొక్క ముద్దుల ♦ నాతివంచు
పావనివని నాపాలిటి ♦ భాగ్యదైవ
మవని నమ్మిచరించితి ♦ మదిని యెపుడు॥

సుందర—తల్లీ! ధన్యోస్మి! ధన్యోస్మి! ధన్యోస్మి!

సీ॥ కాళీమతల్లిదా ♦ ఘనమహాత్మ్యంబును
గాంచెడి భాగ్యంబు ♦ కలిగ నేడు
పర్వతపుత్రిని ♦ పరమేశురాణిని
పొగడెడు పుణ్యంబు ♦ పొసగ నేడు

దివిజాలు మెచ్చగ ♦ దేవి! ఖలు మహిషా
సురమర్దనను శక్తి ♦ జూపినావు
భక్తులకెందును ♦ భయము లేకుండను
నీవె ప్రోచుచు పేరు ♦ నిలిపినావు।

ఆ॥ వె॥ నీదు మహిమబాగడ ♦ నేరికి శక్యంబు
వలవియగునె బాగడ ♦ నాదిశేషు
కైన మనుజులెంత ♦ కనుగొన నీసృష్టి
తరమె తరమె తరమె ♦ తరమె తరమె॥

సుబు—కుమార! చచ్చితివి గాచుకొమ్మదె.

సుంద—కలుషమతీ! తాళుము.

కాళీ—సుందరసేనసుబుద్ధులారా! మీకేటికీ వైరము?

సుంద—తల్లీ జగద్రక్షకీ! ఈతుచ్ఛుని కూల్చెదనని శిరశ్శపథము జేసినాడ. కాన జెల్లింపవలయు.

కాళీ—ఏమి యానీ ప్రతిజ్ఞ?

సుంద—

సీ॥ ఏనే జనించితి ♦ నేని సుక్షత్రియ
వంశంబునందు; మ ♦ ద్వంశ్యులే స
దాయిల సత్యవ్ర ♦ తాచారసంపన్ను
లైన; జనని కమ ♦ లాంబయే య
తివలలోన మహాప ♦ తివ్రత యైన; నా
తండ్రి ప్రతాపుడే ♦ ధరను శూరు
డేని వేల్పులవేల్పు ♦ హిమగిరితనయ
కాళిక శివురాణి ♦ శూలపాణి

తే॥ గీ॥ యై సకలభువనములను ♦ నేలుచుండ
నేని త్రెక్కనేసెద కుమారు ♦ ని జనకుని మ
రణముదాచిన యీమంత్రి ర ♦ క్కసిని వి
గతశిరస్కుఁజేసి భూమిపై ♦ కూలునటుల॥

కాళీ—నీ పనిపటుల నీప్రతిజ్ఞ చెల్లినది. నీబదులు నే నామంత్రి సుబుద్ధివర్యుని గూల్చియుంటిని. సుబుద్ధీ! నీవేల యుక్తాయుక్తంబులరయక బాలునిపై కత్తిగట్టితివి.

సుబుద్ధి—తల్లీ! జగదంబ! నేనొక కఠినప్రతిజ్ఞ యొనర్చియుంటిని.

కాళీ—ఏమది?

సుబుద్ధి—

తే॥ గీ॥ వీరసేనుని మంత్రిన ♦ యేని గూల్చు
వాడ సుందరసేనుని ♦ వానిని లఘు
ని పిదప సకలరాజ్యము ♦ నిచ్చువాడ
నాదు కోకిలాప్రియునకు ♦ నయముతోడ॥

కాళీ—నీప్రతినకూడ నెరవేరెనా? నీవనిన ట్లు ప్రథమమున సుందర సేనుని బరిమార్చి యుంటివి. తరువాత రెండవదేమనగా సకల రాజ్యము కోకిలాప్రియున కర్పించుట. అంతేగా?

సుబు—అవును తల్లీ!

కాళీ—కోకిలాంబ! నీప్రతిన యేదో యుంచుక విన్నవించుము.

కోకిలాంబ—

సీ॥ నేనే సదా జన ♦ నీ నిను పాదపం
కజములు నమ్మిన ♦ కాంతనేని
సమ్మతంబుగ నిల ♦ సదయుడౌ నాతండ్రి
యానతి మీరని ♦ యతివనేని
సదమలచరితుని ♦ సఖుని సుందరసేను
నే బహిఃప్రాణమ ♦ నిమది నెపుడు
దలచు సుసాధ్వీమ ♦ తల్లినేని, జగతి
బంచ భూతంబులె ♦ బరగునేని

తే॥ గీ॥ విమలచారిత్రులౌ వీరు ♦ విగతజీవు
లు పతియు పితయు జీవము ♦ లు బడసెదరు

[illegible] నీకు కృపయెటులు ♦ కలిగెనేని
గానిచో నొనర్చుకొనెద ♦ కంఠహతము.

(అని కరవాలము నెత్తి కంఠహతము చేసికొనబూనును)

కాళీ—సుబుద్ధీ! మంత్రీ! వింటివా! నీవీమాత్రము గ్రహించక చేలపై యింతవరకు దెచ్చితివి. ఇకనైన నీతనయయభీష్టము సిద్ధింపజేయుము. రత్నాకరుని వానిగృహంబున కంపుము. కోకిలాంబ కడు సుగుణశీల.

సుబు—చిత్తము. తల్లీ! నీయనుగ్రహము.

కాళీ—కోకిలాంబ! నీయభీష్టము నెఱవేరినదా?

కోకి—జననీ! సకలంబునకు నీవే కర్తవు.

కాళీ—సుందరసేనా! నీవిక కోకిలాంబను బరిగ్రహింపుము. కళావతినిగూడ వివాహమాడుము. ప్రజానురంజకంబుగ రాజ్యము సేయుము. నీయిష్టము వచ్చిన వరంబొండు వేడుడు. ఇచ్చుచున్నాను.

సుందర—తల్లీ! యిట్లుగానిమ్ము, వేడుచుంటి.

తే॥ గీ॥ ధరణి యీతిబాధలు లేక ♦ తనరుగాక!
ప్రజలు నన్యోన్యవైరము ♦ ల్బాసి సఖ్య
మునను జీవయాత్రను సలు ♦ పుదురుగాక!
కరుణ నీకు భక్తులయందు ♦ కలుగుగాక॥

ఇది పంచమాంకము

సర్వము సంపూర్ణము.

